నారాయణ సుబ్రహ్మణ్యకవి

# ధర్మరాజవిజయము

బెజవాడ, 1913

Record no. 288

Nārāyaṇa Subrahmaṇyakavi

Dharmarājavijayamu

Bejavāḍa, 1913

Record no. 288

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

నారాయణ సుబ్రహ్మణ్యకవి.

ధర్మరాజవిజయము / నారాయణ సుబ్రహ్మణ్యకవి ప్రణీతము.- బెజవాడ : వాణీ ముద్రాక్షరశాల, 1913.

117 p. ;20 cm.

Record no. 288

Nārāyaṇa Subrahmaṇyakavi.

Dharmarājavijayamu /Nārāyaṇa Subrahmaṇyakavi praṇītamu.- Bejavāḍa : Vāṇī Mudrākṣaraśāla, 1913.

117 p. ;20 cm.

Record no. 288

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB          Date filming began:

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# ధర్మరాజవిజయ[illegible]





నెల్లూరుజిల్లా దర్శితాలూకా [illegible] నివాసుం డగు శ్రీ సీతారామచంద్ర వరప్రసాదలబ్ధ[illegible] విద్యా విశారదుడగు నారాయణ సుబ్రహ్మణ్య కవి ప్రణీతము.

---

చిన్నగూడూరు నివాసులగు బ్రహ్మశ్రీ శ్రీమాన్ ఆళ్వార్ల గోవర్ధనం నర్సింహాచార్యులగారి చేతనున్ను కోటపాటి నివాసుండగు నూతలపాటి అప్పయ్యగారి చేతనున్ను ప్రమాదజనిత దోషంబులు లేకుండునటుల బరిష్కరింపంబడిరెను.

---

బెజవాడ వాణీ ముద్రాక్షరశాల యందు
బి. కే. స్వామిచే ముద్రింపం బడియె.

1913.





శ్రీరాములు
శుభమస్తు.

శ్రీలంబోదరాయ నమః.

శ్రీశారదాంబాయనమః.

# ధర్మరాజవిజయం.

శ్రీమద్యంజనిసూను ధంఘ్రియుగముఁ సేవింప సద్భక్తిచే । సౌమిత్రుం డొకవైపునందున మహీజాదేవి వామాంకమం । దామోదింపగ తమ్మలూరిపురమం దానందుఁడౌ రాముఁడుఁ । బ్రేమఁ రాఘవరాయు బ్రోచు శిరులఁ బెంపొందగఁ నిత్యముఁ.

శ్రీవైదర్భియురాధికారమణియుఁ సేవించి వింజామరల్ । పీవఁ వేణువుపాణిపల్లవమునఁ బ్రేలంగ గోపాంగనా । భావంబుల్ రమియింప యోగిజనముల్ పద్మాక్షుదేవేశయం । చేవేళ న్నుతిశేయవెల్గుహరి రక్షించుఁ రాఘవామాత్యునిఁ.

దర్వు - శంకరాభరణం - అటతాళం.

వేణుగోపాలా ఆశ్రిత దీనపాలా శ్రీ॥ వేణుగో॥
గానలోలా కాంచనచేలా మానిత గుణజాలా బ్రోవవదేలా॥ వేణుగో॥
యిందిరావరా నందకుమారా మందరగిరిధారా యిందురావేరా॥ వే॥
వినుత సూరిజన తమ్మలూరీ వనజాక్షా శౌరీ దనుజవిదారీ వేణుగో

చ. రవికుల పుంగవుండనుపు రంజిలుచుం జని సాగరంబునుఁ
జవమున దాటి లంకనవి శంకితబుద్ధినిఁజొచ్చి యందు తా
నవనిజగాంచి యుంగరము నాయమకిచ్చియు వేగవచ్చి భూ
ధవునకుదెల్పు వాయుజుడు దద్దయు రాఘవరాయుఁబ్రోవుతఁ.

### లక్ష్మీస్తుతి.

క. హరివక్షస్థలవాసిని సరసిజదళనేత్రి చంద్ర సమవదనాయుం
దిరయిందిందిరవేణీ వరములొసగు మమ్మ రాఘవామాత్యునకున్.

### సరస్వతి స్తుతి.

క. పలుకుల వెలదిరో నిను మది
దలచెద మద్వాక్కునందు దయతో నిలుమా
వలసిన శబ్దంబులు నా కలవడగానిమ్ము వాణి యళికులవేణీ.

### విఘ్నేశ్వర స్తుతి.

క. గజవదన పాశుహస్తా త్రిజగన్నుత దివ్యచరణ దీనశరణ్యా
భుజగాభరణా నేనీ కు జోహారులొనర్తు బ్రోచికోరక లీవే.

### కవి స్తుతి.

క. పన్నుగను కాళిదాసుని నన్నయభట్టార్యు దిక్కనను శంభునిపె
ద్దన్నను భాస్కరుసోముని సన్నుతిగావింతు నార్థ సత్కవివరులన్

వ. ఇట్లు దేవతాస్తుతియు సుకవిజననుతియుం గావించి యీ ధర్మరాజ విజయంబను నాటకంబు శేయ నారంభించి తంగు కథా వృత్తాంతంబు సభికులకెరుంగింప ముందు సూత్రధారి ప్రవేశము.

### దరువు.

రామరమావరకామితఫలదా సామజవరదా దేవేశా
రామదనుజవిరామరవికులాబ్ధి సోమతమ్మలూరి ధామ శ్రీరామా.

### మాటలు.

ఎవరయ్యా మీరు? వరేనేను సూత్రధారిని. ఇందులకెందు కరుదెంచిన వారలు? యీరోజు జరుగు నాటక కథావృత్తాంతంబు సభికులకెరుంగిరిప వచ్చినవాడా. అయితే కానిమ్ము. వరే యింకను నటీ రాదామె. ఓనటీ రమ్ము. వచ్చుచున్నదానను.



### నటీ ప్రవేశము దరువు.

రామచంద్ర ప్రభో మహారాజ్ రామచంద్ర ప్రభో మహారాజ్ భీమవిక్రమోద్ధామ తమ్మలూరి రామచంద్ర ప్రభో మహారాజ్ ఖండన పండిత మార్తాండ వంశదీపనే దండవరద రాదా వాదా రాదా దయ రామ.

దీనపాల గానలోల మానిత గుణజాల జ్ఞానశీలము విజనాను కూలా చలా మేలర రామ చంద్ర.

పరగ సుబ్రహ్మణ్య కవిని నరశివరము లిచ్చు రామచంద్ర.

### మాటలు.

సూత్రధారి నటిం జూచి నటీ యింత కాలయాపనం బేల జరిగె. సూత్రధారీ ఏను నాటకపాత్రలను తయారుచేయుచు నాటకం బేదియైనది యెరుంగక యోచించుచున్నదాన.

సూ॥ నటి॥ యెరుగవా భారత మందలి నరణ్య పర్వములో నుండు సైంధవ పరిభవంబును ధర్మరాజు విజయంబును అను కథ మరచితివా ఏమి. ధర్మరాజ విజయంబను క్రొత్త నాటకంబె ఎవ్వరు రచియించిరి? నటి దెల్పెద విను.

### కవి వంశావళి.

సీ. వైదికాచార సద్వర్తన ధీరుండు నారాయణాన్వయార్ణవహిమాం
శు । శాంతుడమలుండు, హితమతి కౌండిన్య గోత్ర పవిత్రుండు
ప్రాతిభకుడు । పిచ్చయార్యుండన బెంపొంది యల్లమాంబను వివా
హంబయి ఘనత నిష్ట । సద్వ్రతంబులు సల్ప సరసు ఉత్తము లిరు
వురును సుబ్రహ్మణ్యవర నృశింహ్వలలితరూపుల వేంకట లక్ష్మ
మాంబ । లక్ష్మి నరసమ్మలనుగాంచె లలితయుతుల । నందు నగ్ర
జు డార్యపూజాగ్ర ఘనుడు । శ్రీరమావరు సత్పాదశేవ పరుడూ.

వ. వారిరువురును ప్రవర్ధమానలై.

క. దనరగ సుబ్రహ్మణ్యుండును కవితనృశింహశాస్త్రి యురుతర కావ్యం
బును నేర్చిరి వినయా పరు
లనఘులు నారాయణాన్వయంబు వెలుఁగఁగ.

వ. అం దగ్రజుండగు.

క. వర సుబ్రహ్మణ్య కవీశ్వరుడు జయశ్రీభుపరాభవంబను కథతా
ధరచింతలపుడి వంశోద్ధరు రాఘవమంత్రికంకితంబుగ నిచ్చెఁ.

మాటలు.

ఏమీ సూత్రధారి ఎవ్వరా పురుషుండు మహా పుణ్యుండు కృతి నందెగా తత్సుకృతం బేమనవచ్చు.

చ. చెరువులు త్రవ్వేయుటఁ ధనము జేర్చియు దాచుట బ్రాహ్మణాళికిన్ సుం
దిరముల నిల్పి సంపదలు తీరనివిచ్చుట దేవళంబు లే
ర్పరచి ప్రతిష్ఠ శేయుటయు భాసురమౌ వనిబెంచుటఁ కృతిఁ
స్థిరమతి నందుటఁ జలసుదీర్ఘిక నుంచుట సప్తసంతతుల్.

మాటలు. ఇట్టి సప్త సంతానములలో చిరకాలంబు నిలుచు కృతి సంతానంబు వడశెగా నమ్మహాత్ముని చరితంబు పాపహరంబుగాన నంతయు నెరింగింపు.

సూత్రధారి వాక్యం.

నటి వక కృతి సంతానంబే కాదు సప్త సంతానంబులు వడశె నట్టి దశ దిశ ప్రకాశమాన సమాన యశోవిశాలుండగు శివ్వసుంధ రామరశ్రేష్టుని చరితంబు అరుదు గదా నెరింగించెద విను.

గీ. శ్రీకరంబగు నెల్లూరి జిల్లయందు
ధర్మపరులుండు నాదశిఁ తాలుకాలో
మేటి నగరంబు యాశ్రిత కోటికాట
పట్టునై యొప్పు తమ్మలూర్పట్టణంబు.



దరువు - జంఝూటి - అట.

వారి జాతిరోవినవె తమ్మలూరి పట్టణ వాసులూ
ధీరులమల కృపాపరులు నౌ దారులార్య చరిత్రులూ
స్నాన సంధ్యాద్యనుష్ఠాన ధురీణుల ప్పారి బ్రాహ్మణుల్
దీనజన రక్షకులు సంతస మానసుల్ సత్ క్షత్రియుల్
కోటులకు పడుగెత్తివెలశిన మేటి ధనికులు వైశ్యులూ
మాటదప్పక విబుధ శేవల తోటి మెలగెడు శూద్రులూ
కోరి రాఘవరావు నేలిన ధీరుడౌ శ్రీరాములఁ
జేరిగీతముపాడి మంగళహారతులు నిడుకాంతలుఁ॥ వారి॥

వ. మరియును.

గీ. శ్రీ సమృద్ధి పరులు శ్రితజనపోషులు
సత్యధర్మరతులు శాంత మతులు
దళిత దురితులన్న దాన ధురీణులు ఖ్యా
వినుతయశులు నారువేల వారు. ను

వ. అట్టి యార్వేల వారియందు.

శా. శ్రీమత్కౌశికగోత్ర సంజనితుడక్షీణప్రభావో దయా
దామోదారుడరాతి శిక్షణుడు సిద్ధర్మాత్ముడౌ నందుడుఁ
భూమిఁ చింతలపూడివంశ కలశాంభోరాశిసోముండనఁ
గామాన్యుండయి రాయలప్ప వెలశెఁ గంజాతు శేవార్థియై.

గీ. ఆరాయలప్ప కులసతి సారసదళనేత్రి భర్తృసౌఖ్యాన్విత యూ
దార సుగుణాఢ్య గీతి పారాయణ నాకున్యథివి పాపమ దేవి.

వ. అట్టి సుగుణ సంపదభిరాము యగు.

క. జాయా సహితుండై యా
రాయులు సంతసము ధర్మరక్షణ వ్రతముల్
ధీయుతుడు శేయగలిగెన
పాయము లేకుండ సుబ్బయా మాత్యుండుఁ.

వ. ఆకుల పావనుండు.

ఉ. సంతత దానశీలుడతి శాంత తపోనిధి నిర్మలాత్ముడ
త్యంత కుతూహలుండు పరదార వివర్జితుడార్య సేవనా
చింతనధీవిశారదుడు సింధురనా(?) బలుండటంచు వ
ర్ణింతురు సుబ్బరావు గుణ బృందము గన్గొని ధర్మరాజుగార్.

గీ. అమ్మహాత్ముని రాణిసుగుణముల దొంతి
చారుతమ హేమవల్లిభా స్వతసుశాంత
పద్మనేత్రులకెల్ల మేల్బంతియనగ
వెలయు లక్షణకాంతంబ వెంకమాంబ

క. వారి రువురుగాంచిరి సుకు
మారుల ధీగుల సుపుణ్యమహిమోన్నతుల
చార్వుల వంశోద్ధారుల
నారుగ్గురు సుతుల చతురానందముగ.

వ. వారల నెరింగించెద.

సీ. దర్పదూరుండు శ్రియః ప్రతిచరితంబు లెపుడు పఠియించు నప్ప
మంత్రి । సూర్యమంత్రి పాస శుభవాగ్విశారదుం డొప్పుల కుప్ప
రాయప్ప మంత్రి । యొక సక్కమైనకైన వికటంబులాడక నిక్కం
బు బలికెడు యక్క మంత్రి । హితమతి నాశ్రితతతి బ్రోచు చతు
రుండు నతినీతిశాలి సీతయ్యమంత్రి । సుగుణములదొంతి వేంకట
సుబ్బమంత్రి । కార్యసాధకుడైన వేంకయ్య మంత్రి । యనెడు
నార్వురవడశె నన్వయము వెలుగు । సుతుల ప్రవిమల తేజుల
సుబ్బరావు.

వ. అందగ్రజుండగు నప్ప మంత్రి.

సీ. శ్రీమీర భువికీర్తి చెన్నొంది వెలిగెడు । నార్వేల వారిలో నతి
శయించి । సత్యక్షమాశాంతి శౌచదానంబుల సరిలేరనెడు నీతిపరత
మించి । సంతత హరిపదచింతన తత్పరుండంచు నార్యులచే నుతించ



మించి । చింతల పూడ్వాం శక్షీరాంబునిధి సుధాకర మూర్తియన
యశస్ఫురణబెంచి । యంచితాకమ సూక్తి పఠించి విప్ర । సంచ
యంబుల బోషించి సకల భూత । సమత మదినెంచి గ్రోధంబు సం
హరించి । బరగె గుణముల దొంతి యప్పయ్య మంత్రి.

క. పాత్రుడగు నప్ప మంత్రి క
ళత్రము మహలక్ష్మిదేవి లావణ్య సుచా
రిత్రను గని పొగడుదురా
యత్రికి ననుసూయలకు సమంబని జనముల్.

ఉ. వీరల కుద్భవించి రతి వీరులుగాన కళావిశారదుల్
కూరిమి పుత్రు లిర్వురను గుర్వయకోటయ మంత్రులంచు
నిద్ధారుణి పేరుజెంది నగధారును గొల్చుచు మాతృ పితృ సే
వారతులై వెలింగిరల వారిజ మిత్రశశాంకులోయనన్.

గీ. మరియు నప్పయ్య మంత్రి సన్మార్గవతుల
గనియె ముప్వురి దుహితలం గాంతి తనుల
పరమపాతివ్రత ప్రౌఢి బరగువారి
సుబ్బమాంబను వెంకమ సుబ్బమాంబన్.

గీ. గనెను సీతయ్య ముగ్గురు తనయు లందు
రమ్య గాత్రుండు పెద్ద సూర్యనాధరావు
వినయమున రాము నెడల లక్ష్మనుని యట్ల
భక్తిచే గొల్చు కృతిపతిన్ బాయకెపుడు.

వ. మరియు శ్రియః పతిప్రియ భక్తుండగు నాయప్ప మంత్రి పుత్ర
ద్వయంబు.

క. ఉర్వీశ పూజ్యులరిదో
ర్గర్వ హరణ శౌర్యధుర్యులార్య చరిత్రుల్
సర్వజన ప్రియులు శాంతులు
గుర్వయకోటయుల కీర్తి గొమరొందె భువిన్.

క. బలరాము నట్లు గుర్వయ
నల కృష్ణుని రీతి కోటయామాత్యుండుర్
బల రామకృష్ణులనగను
వెలశిరి సత్కీర్తి మైత్రి విభవములందుర్.

క. అందు గుర్వయ్య కార్గురు
నందనులు న్నొక్క పుత్రినయ నానందం
బొందగను గల్గిరిల వా
రందరు సద్ధర్మ చరితు లార్యులు మెచ్చన్.

వ. నటీ వీరిలో మేటియైన వేంకట సుబ్బారావు సుగుణ శ్రేష్ఠుండై యనవరతంబు.

క. జననీ జనకుల బ్రోచుచు
ననుజుల కనురక్తుడగుచు నాయాపనులన్
పినతండ్రి మాటదాటక
వినయ పరుండనుచు ధరను వినుతియు గాంచెన్.

వ. నటీ యింక కోటయా మాత్య వృత్తాంతం బెరింగించెద సావధానంబుగా నాకర్ణింపుము.

క. ధీరుడు కోటయ్య యు
దారుడు సద్ధర్మ పరుడు తగనూరి ప్రియుం
డా రోగ్యం డమలుడు శ్రీ
నారాయణ పాదసేవ నాతత్పరుడున్.

గీ. అట్టి కోటయ్య మంత్రి పెండ్లాడె రత్న
నార్తిజనకోటి మృదువచస్ఫూర్తి మేటి
దానధర్మ దయాశాంతి దముల ధాటి
విమల గుణపేటి: లక్ష్మిదేవి వధూటీ.

వ. యిట్టి జాయా సమేతుండై కోటయామాత్యుం డనేక సుకృత కార్యంబు లాచరించి యీ కృతి కధిపతియయ్యె.



మాటలు.

అనిన నటి సూత్రధారిం జూచి యేమేమీ యన్నృతంబు లాడెదవు మొదట కృతిపతి రాఘవరావని యెరింగించి యిప్పుడు కోటయామాత్యుండనియెదవు యేమీ నీచిత్త వైకల్యంబు వింతగా యున్నదే.

సూ.—నటీ! కోటయా మాత్యుండను నామంబు నామకరణ నామంబు. ఈ యుత్తమునకే రాఘవరావను పౌరష నామంబు గలదు. అన్నామంబు బ్రాపించిన తెరంగెరింగించెద.

సీ. శ్రీమీర నర్థిజన చింతామణియనంగ రహిమించు నైజాము రాజ్యమందు! పరహిత పరులార్యచరితు లుత్తమధీర గణముండు నావరంగల్లు జిల్ల!ఫల పుష్ప సస్య సంపత్సమృద్ధియు మాను కోట తాలూకాలా మేటి నగర।మనదీన జనములకనుకూలకల్పకతరువు యల్లంపేట ధర్మకోట । నట్టి పట్టణ మేలేటి హరి సమాను । డరయ దామిడి వారి వంశాబ్ధిహైమ । కరుడు బిదునూళ్లగోత్ర ప్రకాశ యశుడు । వెలశె వేంకట నరసయ్య వినుత బలుడూ.

క. అలవేంకట నరసయ్యకు
గలిగిరి ముప్వురుకుమాళ్లు గంధర్వనిభా
లలితులు శౌర్య ధురీణులు
జలజాక్షుని పాదభక్తి సలిపెడు సుగుణుల్.

వ. అందగ్రనందనుండు.

సీ. శ్రీ విష్ణుపాదసంసేవ వర్తనలందు ప్రహ్లాదురీతి. భూపాలనందు । ధర్మరాజునిరీతి ధైర్యంబు నందున దనరు గాంగేయ భూధరమురీతి । నర్థులబ్రోచుచో నమర భూరుహరీతి హితుల బ్రోవను శంభు హితునిరీతి । శరణు జొచ్చినవారి వరకృపనేలుచో దశరథరాజనందనుని రీతి । ధారుణీ స్థలి వేంకటనారసింహుల్వ తనయులందున తొలిభార్య తనయుడైన । సీతరామాభి ధానుండు చెల్వుమించి । జగతి సత్కీర్తి గాంచె సజ్జనులు బొగడా.

గీ. మరియు నీ నృపుసాపత్ని మాత సుతులు
భద్రయశులందు పెద్ద గోపాలరెడ్డి
రామ చంద్రుని బోలిన రామచంద్ర
నృపతి యనువారు ననుజులై నెగడిరిలనూ.

గీ. మరియు ముప్పురు పుత్రికల్ మాన్యయశులు
ధర్మచారిత్రులును గల్గి ధర వెలింగి
రట్లు వేంకటనరసయ్య నాగుగురను
తనయ తనయులగాంచి సంతసముజెందే.

గీ. మాన్య చరితుండు సీతరామయ్యగారి
పత్ని ధర్మవతీకులపావ నీయు
దారమతి భర్తృపాదశేవారతియును
నర్థి కల్పకదంబయాయచ్చమాంబా.

వ. ఇట్టి సాధ్వీమణితోడంగూడి సీతారామ భూపాలుండు.

గీ. దేశముఖులందు మేటియౌ దేజరిల్లి
సోదరుల తోడగూడియు సాధురక్ష
ణములు దాన పరోపకారముల నేక
మనుజుల కొనర్చె సీతరామయ్య రేడూ.

ఇట్లు సత్కార్యంబు లనేకంబు లాచరించి.

గీ. అనుజులను నన్యదేశాల కధిపులుగను
జేసి తానిహ సుఖములరోశి వనజ
నాభు మదిలోన మరువక నమ్మిభూమి
సురలకును నగ్రహారపు శిరులొసంగి.

క. వినుతయశుడు నాకమునకు
జన సీతారామరెడ్డి సతిసహ గమనం
బును జేయగ బూనిన పుర
జనములు మేమొత్తుమనిన జనుటకుమానెన్.



వ. అట్లు జన సంప్రార్థితయై సహ గమనోద్యోగంబు మాని.

క. మానిని భర్తను దలచుచు
తానె ప్రజాపాలనంబు దగ జేయుచు
సన్మానితయై సత్కార్యము
లానందము తోడయచ్చమాంబ యొనర్చెన్.

సీ. ధరను జయపురిని సీతారామస్వామి క ధ్యయన కళ్యాణంబు లా
చరించె! దినము తన్నాశ్రయించిన దీనులకు నన్న వస్త్రాది దానము
ల్ వరుసనేసె। గంగ గోదావరి కావేరి కృష్ణవేణ్యాసింధులను
తీర్థయాత్రసేసె। శాంతమానసమున నశ్రాంతంబు వదలక భక్తిచే
రామ జపంబు జేశె। పూర్ణభక్తిని వైష్ణవ పూజజేశె। కలుష
హరణంబులగు పుణ్యకథలు వినియె। బంధుజనములు వెరగంద ప్ర
జలనేలె। సచ్చరితయైన దామిడి యచ్చమాంబా.

వ. యివ్విధంబున నా యచ్చమాంబ సుకృతకార్యబు లాచరించుచు జనరక్షణ దక్షయై మెలంగుచు దగిన ప్రధాన శేఖరుండు లభింపడాయెనని యోచించు చుండే,

క. బోటిరో విను చింతలపుడి
కోటీశ్వరరావు తీర్థకోటులు గన న
చ్చోటికి జన నచ్చుతురుని వా
గ్ధాటికి సద్ధర్మమతికి ధైర్యంబునకున్.

వ. మనంబున నచ్చరువడి యా యచ్చమాంబ మందిరంబునకు బిలువ నంపి నీయుదారసాహస ధర్మంబులు మత్పరిచారకుల వలన నెరింగితి.

చ. బలమున దేజమందు ననుభక్తి జపంబుల దానధర్మ ని
శ్చలమతి కాంతి సత్యమున శౌర్యతధీరసుశాంతులందు నా
హాల ధరుభానుపార్థశుకునర్కజు నయ్యమనూనునింబలిన్
కలువల రేని రామ హరి కాంచన గ్రావదధీచి బోలుడా.

క. కావున నిప్పురి పాలన
కీవె సమర్థుండ విచట నెవ్వరు లేమిన్
బ్రోవుము ప్రజలను రాఘవ
రావు యెనెడు పేరుతోడ రహిమిగులంగన్.

వ. నటి—నాటనుండి రాఘవరావు యను నామంబు ప్రశస్తి జెంది వెలింగె నంత రాఘవామాత్యుండు,

గీ. భాగినేయున యుప్పలపాటి వంశ
జనితు శ్రీరాములను సాధుచరితు తమ్మ
లూరి పురమున కాపురంబుంచి సర్వ
కార్యములకును నధికారకర్త జేశె.

వ. రాఘవా మాత్యుండు సతీ సమేతుండై యల్లంపేట యందు ప్రధానాధి కారంబు వహించి.

క. తన మాత్రుభగిని వెంక
మ్మను తోనుంచుకొని మాత్రు మర్యాదను స
ద్వినయంబున నాయమ దె
ల్పిన పనులను మెలగి బ్రజల బ్రీతిన్ బ్రోచున్.

సీ. జనక నృపాలు భంగిని సర్వజనముల నొప్పింపకను దయ యొప్ప నేలె। పరశురాముని భాతి బలుదుష్ట చిత్తుల గర్వమణంచియు ఘనతబెంచె। పాండవాగ్రజు రీతి పరమభక్తిని బ్రహ్మ బృందంబులను ధర్మబుద్ధిబ్రోచె। నంబరీషునివలె నతి దృఢమతితోడ దగిలి సద్వ్రతముల దనిపె సురల। మించి సర్కారులోన జయించి తనను పాలనకు జాలవని కొన్ని యూళ్లుగొనియె। వసుధ చింతలపుడి వంశవార్ధి సోముడైన రాఘవ్రరావు సద్ఘనతరావు.

వ. యిట్టి ధర్మనిధియైన రాఘవరావు మంత్రిగా నాయచ్చమాంబ ప్రజా పాలనంబుశేయుచు దన వంశంబు నుద్ధరించు కులపావనుండగు తనూజుని కొరకారయు చుండె.



నటీవాక్యం— సూత్రధారీ అప్పుణ్యాత్మురాలి మనంబునకనుకూలుండైన తనయుండు సంభవించెనా.

సూ—నటీ తొందరపడకు తెల్పెద.

సీ. మాని వాసంబగు మానోకోట తాలూక కుమ్మరకుంట శ్రీ కోట్లపంట। నాపురి సర్వభోగ్యంబుల సుత్రామురీతిగా జనముల బ్రీతి నేలు। నరనరవరుడు జన్నారెడ్డి వారివం శాంబుధిరాకా విహారసముడు। సంకటదూరుండు వేంకట నరసయ్య దేశముఖుగారన దేజరిల్లి। ధర్మమతి జేశె విష్ణు సంతర్పణములు వన తటాకంబులును వేశె వినుతయశుల। వడశె నార్వుర నాచక్రవర్తులట్టి। సుతుల నిర్వుర తనయల హితవుగాను. నారల నెరింగించెద.

సీ. పంకజాక్షుని పాదభక్తి తత్పరమతి చెలగు వేంకట నారసింహ్వారెడ్డి। వలయు నర్థంబు నర్థులకిచ్చు కలియుగ బలిచక్రవర్తి గోపాలరెడ్డి। రమణీయ వాగ్విశారదుడు లేఖన దక్షు డెలమి వేంకటరెడ్డియిలను దాత। సజ్జనసాంగత్య సమ్మోద కలితమానస మూర్తియగు జగన్నాధరెడ్డి। ప్రకట గుణశాలిశాంతుండు సకల శాస్త్ర ప్రౌఢిగల్గిన వేంకట రామ నార। సింహ్వాభూపతి శ్రీ విష్ణుసేవ రతుడు చన్న కృష్ణాభిధానరాజ న్యనుతుడు.

వ. ఇట్లు షట్చక్రవర్తుల యశోధనంబులం బొడజూప నీయని సద్గుణతతలెగల నార్వురు కొడుకుల వేంకట నారసింహ్వా పుడమీశుండుగాంచె నందు నిగమ విదులైన ధరామరులచే పొగడొందిన సగర చక్రవర్తియోయన దశదిశ ప్రకాశిత యశోవిభవాభి రాముడగు, వేంకట్రామ నరసింహ్వా భూపాలశేఖరుని తనకు దత్త పుత్రునిగా నీయచ్చమాంబ గైకొనియె నా సత్పురుషుండు దామిడివంశ పయః ప్పారావారరాకా విహారుండనయశః ప్రకాశితుండయ్యె. నటీ.

దరువు.

మానిని విను వేంకటరామ నారసింహ్వా భూపతీ

దీనజనాపాల నధీనిధానగుణమతీ
మాన ధనుండాంధ్రతురకహూణ విద్యల్
గాన మమ్మాహాత్ముని సరిజగాన శక్తియుక్తుల్
బియే బియల్ వరకు పష్టున ప్యాసు జెందెనూ
వెయ్యార్లర్థులకిచ్చి విస్తరించి నెగడెనూ
యోచనశాలి కలెక్టరు హోదా దాచే పరులబ్రోచుచున్
నీచులసిక్షించి సద్ధర్మాచరణము గాంచుచున్
మానితమగు పూర్వరాజ ధాని యల్లంపేటనూ
పూని రాఘవరావును దీవానుగ నియమించెనూ.

వ. నటీ యిదే రాఘవరావు అమాత్యాధి కారంబున యల్లంపేట యందు నివశించుటకు కారణంబు ఇంక కృతిపతి యగు ఈ రాఘవరావుచేయు ధర్మంబులు పెక్కులు గలవు.—అయినను కొన్ని నే విన్నవించెద యెన్నియని యన్న వెయినోళ్లున్న పన్నగాధిపు కెన్న నశక్యంబు నటీ.

గీ. అవనిలో రాఘవా మాత్యుడాచరించు
ధర్మదాన పరార్థక తతిప్రశస్త
సుకృత కార్యంబు లివియని చూపిచెప్ప
నలవిగా వొక కొన్ని నేదెలుపువాడా.

వ. నటీ—మంత్రి కులశేఖరుండగు రాఘవా మాత్యుండు జన్మస్థానంబగు తమ్మలూరి పురంబున తన పూర్వులు ప్రతిష్టించిన శ్రీ వేణుగోపాల స్వామికి నిత్యసేవ శేయుచు నప్పురంబున తానాచరించిన సుకృత కార్యంబులు దెల్పెద వినుము.

సీ. ఏ మహాత్ముడు కాశి రామేశ్వరాది యాత్రలు సకుటుంబుడై
యిలచరించె । నే పుణ్యుడాలయం బేర్పరించియు రామ కృష్ణాది
సురల బ్రతిష్టజేశె। నేచెతురుడిద్ధర నా చంద్రతారకంబుగను సత్క
వులచే బొగడ దొంగ । నేయుదారుడు ధీరుడయ్యు మేలగు సర్వ
వృక్షు నారామంబు వృద్ధిజేశె ॥ నే సధర్ముడు పురిమధ్య నెల్లరులకు



ముఖ్యపావనార్హముగ కూపమును సృజించె । అట్టి రాఘవరావు
సాహస మెరుంగ । తరమె దురితాపహారుడార్య చరిత యశుడూ.

సీ. కట్టించె గోపుర గర్భాలయము ముఖమంటపంబుల రామ మంది
రంబు। పెట్టించె షడ్రశోపేతంబులుగ నిరంతర భోజనము బ్రహ్మత
తినుతింప । పుట్టించె దేవతాపూజల తీర్థయాత్రోత్సాహమును నెల్ల
రులకు మదికి । కొట్టించె సాధు జనకోటికపాయంబు గలుగ వర్తిం
చెటి కలుష మతుల । చేసె కళ్యాణ పట్టాభిషేక గీతభాగవత
మాది పౌరాణ పఠనవస్త్ర । పాత్ర కాంచన దానముల్ బాడబు
లకు । నిలను రాఘవరావు కేవలుడె తలపా.

క. ఇలగల వారలు తనుగని
కులపావనుడనుచు బొగడ కోరి వివాహం
బులు నుప నయనం బులు తో
పలుపురకున్ జేసె ధర్మ పరహిత బుద్ధిన్

సీ. వేణుగోపాల పృధ్వీసుతా విభులకు పూజార్చకులను కాపురము
లుంచె । వేణుగోపాల పృధ్వీసుతా విభులకు చక్రప్రతిష్టలు సలిపె
నిష్ట । వేణుగోపాల పృధ్వీసుతా విభులకు గరుడాశ్వ వాహన గణ
మొనర్చె । వేణుగోపాల పృధ్వీసుతా విభులకు సర్వాంగములను
నొసంగి దొడగె । మరియు స్వేతాభ్రఛత్రచామర పతాకములను
యుత్సవ విగ్రహములకు దగిన। వస్త్రవుల నిచ్చి కళ్యాణవైభవంబు
లెల్లగావించె లక్ష్మమ్మ వల్లభుండు.

వ. యిట్లు శ్రీ మద్రమారమణ చరణ సరశీరుహ శేవాపరుండై శమదమాది షట్కసంపత్తియుతుండై దేహత్రయ సుఖత్రయ కర్మత్రయ కర్తృత్రయ బుద్ధిత్రయ శ్రద్ధాత్రయ ధృతిత్రయ గుణత్రయ శక్తిత్రయ కాలత్రయ లోకత్రయ దేవత్రయ మూర్తిత్రయ వృత్తిత్రయ స్థానత్రయ జీవత్రయ యీశ్వరత్రయ విరక్తిత్రయ భక్తిత్రయ దీక్షాత్రయ నేత్రత్రయ లక్ష్యత్రయ జ్ఞానత్రయాదుల యందు గల మర్మ ధర్మంబులు విబుధోత్తములచే వినుచు నబ్జబాంధవునకు తమంబు లేని తెరంగున

పాప రహితుండై గృహస్థాశ్రమ ధర్మంబున వర్తింపుచు ఋతుకాలంబున ధర్మపత్నియం దనేక సంతానంబువడయుచు ధర్మ కార్యంబులన సదృశుండై జగద్విశ్రాంత కీర్తిపరుండై గణకకుల సార్వభౌముడై పుత్ర మిత్ర కళత్ర బాంధవ సమేతుండై యొక్కనాడు తమ్మలూరి పురమ్మున తాఁబ్రతిష్ఠించిన శ్రీ సీతారామచంద్ర మందిరంబున పండిత సద్గోష్ఠినుండి.

క. ఎంచి తనకీర్తి ధర వ్యా
పించగ వలెననుచు కవినిబిలుపించియు పూ
జించి కుతూహలమున నతి
చంచత్కృపదోప బలికె చాతుర్యముగన్.

క. నిరుపమ వైదిక నిష్టా
పర సుబ్రహ్మణ్య సుకవివర శింధుధరా
వరు ధర్మరాజు గెలుచుట
చరితము కృతి మాకొసంగు సరసగుణాఢ్యా.

వ. అని బహుమాన పురస్సరంబుగా కర్పూరతాంబూలం బొసంగినం గైకొని యమ్మహానుభావు వంశవరంపరాభి వృద్ధిగా రచియించిన ధర్మరాజు విజయంబను చరిత్రం బీ దినంబున సభాజన మనోరంజ నంబుగా నాడువారము.

నటీవాక్యం—సూత్రధారి! యింకొక సందేహము గలుగుచున్నదే మనిన సత్పురుషుండగు రాఘవా మాత్యుండార్యులచే విను మర్మ ధర్మంబులు నీవు వినుపించుచో మర్మంబుగా నాకు వినుపించితివా దేహత్రయాది జ్ఞానత్రయ శబ్దాంతవరకు మదీయ బుద్ధికి జ్యోతకమగు నటుల యాశ్రయింపుము.

వ. నటీ నీకు తెలియదా వివరించెద చెవియొగ్గి విను దేహత్రయ స్థూలసూక్ష్మకారణ శరీరములు సుఖత్రయ విషయానంద వాసనానంద బ్రహ్మానందము. కర్మత్రయ మనగా పుణ్యము పాపము మిశ్రమ కర్మ లేక విధినిషేధ ప్రాయశ్చిత్త కర్మలు కర్తృత్రయ జీవేశ్వర ప్రత్యక్కర్తృత్వములు బుద్ధిత్రయ సాత్విక రాజస తామస బుద్ధులు శ్రద్ధాత్రయ గురుశాస్త్ర నిష్టలయందు విశ్వాసములు లేక రాజస సాత్విక తామస శ్రద్ధలు ధృతిత్రయ సత్వరజస్తమోధృతులు గుణత్రయ సాత్విక రాజస తామసములు శక్తిత్రయ ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తులు కాలత్రయ భూతభవిష్య ద్వర్తమానములు లోకత్రయ స్వర్గ మర్త్యపాతాళములు దేవత్రయ వసురుద్రాదిత్యులు మూర్తిత్రయ బ్రహ్మ విష్ణు రుద్రులు వృత్తిత్రయ శాంతఘోర మూఢవృత్తులు స్థానత్రయ నాభిహృదయ భ్రూమధ్యములు జీవత్రయ విశ్వతైజస ప్రాజ్ఞులు విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృతులువిరక్తిత్రయఇహాకాముష్మికమిశ్రవైరాగ్యములు భక్తిత్రయ బాహ్యాభక్తి అసల్యభక్తి ఏకాంతభక్తి దీక్షాత్రయ దృగ్వాక్స్పర్శదీక్షలు నేత్రత్రయ వామ దక్షిణ నాసాగ్రములు లక్ష్యత్రయ అంతర్మధ్య బాహ్యములు జ్ఞానత్రయ సంజ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞానములు.



నటీ వాక్యము.

సూత్రధారి యివి అన్ని నాకు మునుపే తెలుసును నీకు తెలియవేమోనని యడిగితిం గాని ఇకముందు నేమి జరుగవలయు.

వ. నటీ యింక నీవు జని పాత్రలను తయ్యారు చేయుము.

వ. అనిన సూత్రధారిన్ జూచి మహాసంతోషంబు మనంబున కావహిల్లే కృతిపతికి రాఘవరావు యను పేరు నిస్సంశయంబుగా చెల్లదగు నెట్లనిన.

నటీ—దరువు.

చింతనపూడి రాఘవరావు మంత్రీదాతారే
సంతస సుస్వాంతా సీతాకాంత స్మరణారే
వాపికూప తటాక విత్తా స్థాపన మహారాజ్
శ్రీ పతికృతి బ్రహ్మప్రతి ష్టాపన విరాజ్
సత్యవాక్య మంగళ గీతా నృత్యమందిరార్
నిత్యకళ్యాణోత్సవ దాంపత్యసురపూజార్

ధరను తమ్మలూరి పురీ వరసదావిహార్
పరగసుబ్రహ్మణ్య కవీశ్వరసుపాలనార్.

మాటలు.

సూత్రధారీ ఏను వెళ్లుచున్న దాన నింక కథావృత్తాంతంబు సభికుల కెఱింగింపు అని నటిజనిన తదనంతరంబా సభంజూచి సూత్రధారి.

సూత్రధారి—దరువు.

ఆహాహ వేడుకాయె నీ సభాస్థలిఁ
యూహింప నలవిగాదు వీరి యుజ్వలాగుణంబులఁ
వినయా పరూలన ఘులన్యవనిత దూరులూ
ఘనపుణ్యు లుత్తమాజ్ఞాన జనితులార్యులూ॥ ఆ॥
పరోపకారులూడురీత హరులు శాంతులూ
ధరాను తమ్మలూరి పురీ హరి దలంచు వారలూ.

మా ట లు.

యిట్టి పుణ్య పురుషులాగా నామనవి నాలకింపుడు.

క. శ్రీధరు పద శేవకునకు
సాదరహిత వచనరచన చతురునకధికా
మోదునకుఁ విబుధ జనా
హ్లాదున కమలునకు రాఘవామాత్యునకుఁ

వ. కృతిగా నొసంగిన ధర్మరాజ విజయంబును సింధు దేశాధీశ్వరు పరిభవంబును అను కథను.

ఉ. కంపిని డ్రామ నాడుటకుగా నిదుబూనితి మార్యులార కో
పింపక నృత్యతాళలయ భేదముగల్గిన తప్పులుండినఁ
పెంపుడు చిల్కరీతి గను ప్రేమతో మీ సుతులట్లు మమ్ముల
న్నింపె సగంగ గావదగు నీదినమందున వేగు నంతకుఁ.

వ. ఈ నాటకంబున మాకన్ని పాత్రలు తయారుగానే యు



న్నవి. యుండినను మీ సహాయంబు కొంత గావలయు నది యెయ్యది యంటిరేని.

చ. గుసగుసలాడకఁ మది జుగుప్సవహింపక నిద్రజెందకఁ
వెస పరకాంతలఁ గదియవెళ్లక కంపెని శాలలోపలఁ
పసగనగోరి మీరలు సభాస్థలియందున గూరుచుండి సం
తస మతులయ్యు నాటకము తాత్పరియంబు గ్రహింపుడందరుఁ

వ. ఇదియేమి సహాయంబు.

క. పరనింద కపరనారీ
పరధన హారణులను నిట్లు బలికితి దెలియఁ
ధర సుగుణులార మీరలు
మరువుడు నాపలుకుల న్యమతి దలపకుడీ.

వ. నింక ముందు జరుగబోవు వృత్తాంతంబు నెఱింగించెద సావధానులై వినుండు.

క. రామా రఘుకుల సాగర
సోమాదనుజారివినుత సుత్రామర మా
భామా మనోహరా శ్రిత
కామాధర తమ్మలూరి కమలాక్ష హరీ. అని నమస్కరించి.

వ. సింధు దేశంబేలు సైంధవుండను భూనాథుండు సాల్వరాజ తనూజను స్వయంవరంబున వరియింపంగోరి కరితురగ స్యందనభట సమేతంబుగా సాల్వదేశంబున కరుగుచుండ ఘోరాటవిలో తృణబిందునాశ్రమంబున దృపద నందన నొంటినుంచి పాండవు లడవులకు మృగవధార్థంబరిగిన సైంధవుండా మార్గంబునం బోవుచు పాంచాలినింగాంచి పంచ శరశరపీడితుండై చేరంజని కవయంగోరుటయు నన్నారీరత్నంబు నీవు నాకు సోదరుండ విట్లనుట ధర్మంబు గాదని సామభేదంబులం బలికిన వినకనతండు బలాత్కారంబుగా నెత్తుకొని గొంపోవుటయు కౌంతేయు లడవులనుండి యాశ్రమంబున కరుదెంచి పరిచార

కుల వలన నంతయు నెరింగి కోపోద్దీపితులై యాపాపాత్ముని నెంట నంటి నిశిత శరంబుల నరిబలంబుల ధరపాలుగావించి సింధుపతినవమానించి చంపక విడుచుటయు నతండు మేశునుద్దేశించి పాండవుల భండనంబున జయించ గోరి తపంబు శేయుటయు నమ్మహా దేవుండు సన్నిహితుండై పార్థుని దప్ప తక్కిన వారలనెక్కనాటి కయ్యంబున నోర్వ గలవని వరంబిచ్చి పరమేశ్వరుండు జనుటయు నను వృత్తాంతంబు గల ధర్మరాజ విజయంబను నాటకం బీదినం బాడువారము అందు ముందుగా విఘ్నేశ్వరుండు వచ్చుగాన సభికులందరు గూరుచుండి విని చూచి సంతసింప వలయునని కోరువాడను.

దరువు—రామ అనే పూర్వపు రీతి.

విఘ్నేశ్వర ప్రవేశము.

వ. మీరెవ్వరు స్వామి ఓరీ నే విఘ్నేశ్వరుండ నురా అయితే దేవా వందనములు.

దరువు.

లంబోదర బ్రోవుమా గజానన లంబోదర బ్రోవుమా
లంబోదర హేరంబగణాధిప అంబాప్రియతనయా గజానన॥ లం॥
మూషక వాహన శేష భూషణా దోషహారణ దేవా గజానన॥
శక్రాదీ సురసేవితచరణా వక్రతుండ దేవా గజానన॥ లం॥
వాశిగ తమ్మాలూరీశస నాతనదాసజనాపోష గజానన॥

వ. సూత్ర—దేవా నాటకంబు విఘ్నంబు గాకుండు నటుల నేరవేర్చవలయు నని వేడుకొనియెద.

గణ-వాక్యం—వరె నిర్విఘ్నగా పూర్తి పొందగలదు నేను కైలాసంబునకు వెళ్ళి వచ్చెద.

సరస్వతీ ప్రార్థన ప్రవేశము.

మందరాద్రిధారిణం నంద కుమారిణం బృందవన విహారిణం యిందు శేఖరాసఖం రమావరం శుభాకరం.



సూత్ర— అమ్మా తామెవ్వరు వరే నేను సత్యలోకంబున నుండు దానను బ్రహ్మదేవుని భార్యను మన్నామంబు సరస్వతి యందురు.

సూత్రధారి—దరువు.

వంద నమరవింద సంభవు సుందరీమణీ
మంద మధురవచన శరాదిందు దేహినీ॥ వందన॥
వాణి బద్మజరాణి బంభరవేణి గీర్వాణీ
ఏణిలోచన పోషితామర శ్రేణి సుశ్రోణి॥ వందన॥
అంబ పృథునితంబ దివ్యాంబర ధారీ
కంబుకంఠి భక్తజన కదంబసుకుమారీ॥ వందన॥
ధరను తమ్మలూరి పురీవర విహారిణీ
పరగ సుబ్రహ్మణ్యకవీశ్వర సుపాలినీ॥
వందనమరవింద సంభవు సుందరీ.

సరస్వతి మాటలు.

ఓరీ భక్తాగ్రేసరా నీప్రార్థనకు నామనం బత్యంతానందంబు నొందె. భవదభి మతం బెరింగింపు.

సూ—క. జననీ ధర్మజ విజయం
బను నాటక మాడువార మందులో లోపం
గను పడనీకను మద్వా
క్కున వశియింపంగవలయు గుణారత్న నిధీ.

సూ—మాతా యీ రాత్రి వేగునంతకు నృత్య గీత తాళల యాదులు భేదంబులు గాకుండ సభాజనంబుల మనంబులు పల్లవింప సమయోచిత వాక్యంబులు దోచునట్లుగా ననుగ్రహింప వలయు నిదియే మదీయ ప్రార్థన.

వ. సరస్వతి దాస శిఖామణి నీవు కోరినట్లు యేలోపంబులు దోపకుండ సాహాయ్యనై యుండెద యింక నే సత్యలోకంబునకు వెళ్లి వచ్చెద.

సైంధవ ప్రవేశము దరువు శంకరాభరణం—ఆది.

దశరథ తనయ నను బ్రోవరారా
రారా మురాహర దశసుందరకారా
యిందిరావర సంక్రందనవందిత పదయుగ
దీయిమ్మహిలో తమ్ములూరి పురి సమ్మతి నిలచిన కమ్మవిల్ జనక

ద-వ. సైంధవుండు ప్రధాని శేఖరుం జూచి.

సంవాదం - దరువు - తోడి - ఆది.

రా—మంత్రీవరా హేమాద్రిధీరా చింతలు లేకా యత్యంత సుఖంబులు గాంతురే రాష్ట్ర జనులంతా సంతసముగ మంత్రీవరా.

మం—సింధు భూపా కందర్పరూపా చింతాలులేకా నత్యంత సుఖంబూలు గాంతురు రాష్ట్ర జనులంతా సంతసముగ సింధుభూపా.

రా—చోరాగ్ని దుర్భిక్ష మారీభయంబూల దూరస్తులై యున్న వారె కుటుంబులై మంత్రీ చోరాగ్ని దుర్భిక్ష మారీభయంబుల దూరస్తులై యున్నవారె కుటుంబులై॥ సిం॥

మం—ధనమణి వస్తువాహన సమృద్ధిగల్గి అనయాము దేవపూజనలు సల్పుదురే ధనమణివస్తువాహన సమృద్ధిగల్గి అనయాము దేవపూజనలు సల్పుదురు.

రా—ధర తమ్ములూరి శ్రీహరి మనంబున మరువాక నిరంతరంబు స్మరియించు చుందూరె. మంత్రీవరా ధరతమ్ములూరి శ్రీహరి మనంబున మరువాక నిరతంబు స్మరియించు చుందురు॥ సిం॥

మంత్రి వాక్యం.

రాజేంద్రా తమ రాష్ట్రంబున సర్వవర్గంబుల వారును తమ తమ కులాచారంబులు దప్పక వర్తించుచున్న వారలు నెలకు మూడు వర్షంబులు వర్షించి వసుధ సస్యసమృద్ధియై యే వుపద్రవంబులు లేక పశుపుత్ర మిత్రకళత్రాదులతో గలశి మందిరంబుల సమస్త జనంబులు సుఖంబు లనుభవింపుచున్న వారలు.



రాజు వాక్యం.

ప్రధానశేఖరా సంతోషము నాప్రియ సఖులగు గోటకాస్య కాళింగ సురథ సుధన్వులను సభకు పిలువ నంపుము॥ ప్ర॥ చిత్తము రాజేంద్రా.

దరువు—పూర్వపుది.

రామా రమా అనునది.

వ. వారలు బలంబులతో కనుదెంచిన సైంధవుండు సఖులారా మీరలీ సింహాసనంబులపై గూర్చుండుడి.

ధారుణీ పతులారా మీమీ సుతదారహిత మంత్రి సామంత విద్వత్పురోహిత కవినట భట గాయక వందిమాగధరాష్ట్రజన రథ గజ తురగ పదాత దాసదాసీజనంబులు సుఖులై యున్న వారె.

మం—రాజా సుఖులై యున్న వారలు.

సైం—పరాక్రమ ధుర్యులారా.

ఉ. శత్రువులం జయించి యనిశంబును కోరిన కోర్కెలెల్ల స
త్పాత్రుల కర్థినిచ్చిహితబంధుల దీనులబ్రోచి బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రులను సత్పథముల్ విడువంగ నీకయీ
ధాత్రియు నేలుచుందురే ధర్మము దప్పక సంతసంబునన్.

వ. సింధుభూవర మేమెల్లభంగులన్ క్షేమము. మీరందరు క్షేమముగా యున్నవారలె.

రా— మేము క్షేమం.

రాజులవాక్యం—మమ్ము సైన్య సమేతముగా నిందులకు బిలుపించిన కారణము దెలుపుడు.

సైంధవుని పద్యం.

చ. విను డొకటేను దెల్పెదను వీరయ శోధనులార సాల్వభూ
జనపతి ముద్దుపుత్రికకు సత్యము వింటి స్వయంవరంబునా

వనిత సురూపశీలయని వాడుదురెల్లరు లట్లుగానవేవే
చని మహామాశుభాంగినిక చయ్యన దోట్కొని నిందుదె త్తమా.

రాజుల వచనం.

ఓహోహో కళ్యాణంబు చేకూరుట పరాక్రమంబు ప్రసిద్ధి జెందుట తటస్తించె. నింతకంటె గొప్ప కార్యంబులు రాజులకుం గలవా ఇదియునుం గాక.

రా—చ. సమరముల న్పరాక్రమముసల్పి జయించిన కీర్తిభోగముల్
సమకురు నట్లుగాక ఘనసాయక బృందముచేత గ్రుంగిన
న్నమర నివాస సౌఖ్యముల నందగవచ్చును రెంటదప్పిభూ
రమణుడు సద్గతిఁ వడయరాదు తపంబులచే గృశింపక౯.

వ. కావున భూచక్రంబునం గల పరాక్రమధుర్య లక్కార్యంబున కరుగు దెంచెదరు వారల తోడంబోరి యావారిజాననను దెచ్చుట మాకందరకు సమ్మతంబు లెమ్మిక నాలస్యం బేల.

సంధి వచనం.

అనిన సైంధవుండు మంత్రిం జూచి.

సైం—మంత్రివర్యా మనదండ నాథుల సైన్యసమేతంబుగా గదల నాజ్ఞాపించితివా.

మం—ధారుణీ వల్లభా అందరు సన్నద్ధులై యున్నవారు.

సైం—మంత్రివర్యా మే మరుగుదెంచు నంతకీ శిఖా వుంగరంబు గొని ధరణీ రక్షణం బరయుచుండుము.

మం—చిత్తమా లాగె నడుచుకొను వాడ రాజా.

రా—మంత్రీ పోయి వచ్చెదము.

సంధి వచనం.

అని సైంధవుండు సైన్యసమేతంబుగా బయిలుదేరి దినదిన ప్రయాణంబున నదీనద పట్టణంబులుగడచి పాండవులున్న యరణ్యంబు దరియం జొచ్చి వచ్చుచుండ.



ధర్మజ భీమార్జున నకుల సహాదేవ ద్రౌపది ధాత్రీక ప్రవేశము.

దరువు - హిందు తోడి - చాపు తా.

సారసాక్ష భవవిదూరమార సుందరా
కార శత్రువీర మేరుధీర మురహరా॥ సా॥

ధర్మరాజు వాక్యం—సోదరులారా తొల్లి యింద్ర ప్రస్తపురంబులో రాజసూయ కాలంబున చూడ సుందరంబుగా నుండు మీదేహంబులు యిప్పుడు శుష్కించి చాలా వన్నె దిరిగి యున్నవి. మిమ్ముల జూడ దుఖంబు లోదవెడు హా.

ధర్మరాజు—దరువు.

కొండ గుహాలయందు సతత ముండు టాయనూ
దండి రాజ్యసుఖములరీ తండములకు జేరెనూ.
నిరత మిటుల పులులగలశి దిరుగవలశెనూ
ధరను తమ్ములూరి రాముడు కరుణ వదలెనూ.

భీముని వాక్యం—రాజేంద్రా యింత విచారంబు మీకేల.

గీ. ఇండనుజ్ఞనాకు నిదే పోయి మద్గదా
దండమునను దుష్టధార్తరాష్ట్రు
గుండెలెల్ల బగుల గొట్టెద నద్ధరా
మండలంబునేలు మాన్య చరితా.

మాటలు—అన్నా ధర్మరాజా యోచింప నేల.

దరువు.

1. కురువర నన్ను బంపు సునిశిత శరములనరికెద పరిభవ కారుల
అరులకు వెరచియు నిరతము నడవుల గిరులదరుల దిరుగనేలా॥

మహాప్రభో! తమకరుణ నాయందు నిండారగలిగి శలవొసంగితి రా యీ క్షణంబ హస్తిపురంబున కరిగి.

ద— మదగజ బృందము నుడుగ భీషణ కదనమరులు మెచ్చ జేశి
గదచె మెదడు లదరబాడిచీ పృధివిపాలు జేతుడాశి॥ కురు॥

2. అర్జునుండు లేచి అన్నా ధర్మనందనా వందనంబులు.

క. చేరి సుయోధనునకు నా
ధారంబై మనల వెడల దరిమించిన యా
క్రూరుని రాధేయుని మ
ఘోర శరంబులను గూల్తు గొను రాజ్యంబున్.

వ. దుర్యోధనుండు తనకు కర్ణుండు గలడని గర్వించి మనతో విరోధంబునకు బూనె గానిభో నింత ధైర్యంబు వానికిం గలదె గావున నన్నంపితి రేని యేనుజని.

ద— పరిపరి విధముల కురుసైన్యంబులు గెరలి దిశలకురుకగా
శరములరి మురి బరపి కర్ణుని శిరము దరిగి మెరతుగా॥ కురు॥

3. నకులుండు—దేవా నమస్కారములు.

గీ. నీదు ధర్మగుణము నెరిగియు దుర్యోధ
నాదులకు సహాయు లగుచునుండు
సకల ధరణి పతుల సమయింతు రాజ్యంబు
పూజితముగ నేలు పుణ్యచరిత.

వ. ఆ దుర్యోధనుండు దుర్మార్గుండని యెరింగియు నట్టి తులువ తోగలశి మెలంగు గుణహీనుల జయింప మీరు నాకు శలవొసంగితి రేని వేగంబునం జని.

నకులుని దరువు.

గడగడ వడకుచు పుడమిపతులు బడలినల్ గడల నడువా
జడిసి దుర్యోధనుని యాశలడుగుబట్టి మిడుకుచేద్వ॥ కురు॥

4. సహదేవుండు లేచి—యగ్రజా వందనములు.

క. మోదంబుచేత మాయా
జూదంబున సకల రాజ్యసుఖములు గొని యీ
భేదము వారికి మనకా
పాదిల్లగ జేయు శకునినని బడవైతున్. అన్నా.



వ. రణంబుగలచో చికిత్సశేయ నది మానుకు మనకీ దురవస్తలకు కారణంబు జూదంబు గదా. అట్టి జూదంబునకు మూలంబు శకునిగదా నా కాజ్ఞయొసంగితి రేని.

దరువు.

సురచిర భక్తిని తమ్ములూరి హరిని మదిని దలచెదన్
దురిత మతుల తలలు దునిమి ధరణికి బలి జేశెదన్॥ కురు॥

వ. అనిన ధర్మజుండు తమ్ములం జూచి.

ధ-గీ. అనుజులార మీరలాడిన తెరగున
జేయ జాలువారు జెప్ప నేల
సమయభంగమగు నసత్యదోషము గల్గు
కాలమొచ్చు వరకు గాచియుండ్రు.

వ. సోదరులారా ధర్మజు తమ్ములు ధర్మపరులని లోకంబుగొని యాడు గాన మనకు మంచికాలంబగు నంతవరకు నిడుములకోర్చి పిదప నరివధంబున కరుగుదము శాంతి పొందుడు.

సంధి-అను ధర్మనందను శాంతవచనంబులు తనకు కర్ణకఠోరంబులై ద్రౌపది యజాత శత్రుని దిక్కు మొగంబై కరంబులు మొగిచి యిట్లని విన్నవించె.

దరువు.

మనుజేంద్రా నా మనవి వినుమా మనుజేంద్రా
అనయముదుస్తర వనవాసంబున ననుజులతో నిటులడగ నేలా
ఘోరారణ్య సంచారముమాని వైరులనిర్జింప నారంభింపవె॥
శాంత తపస్వులచెంత జేరి ధీమంతుడవై రాజ్య చింత మరచితిరి
ధరను రాఘవమంత్రి వరదు తమ్ములూరీ
పురి రాముడు గల దరులకు వెరవనేలా॥ మనుజేంద్రా॥

ధర్మజుని వాక్యం—ద్రుపద నందనా విను.

క. సరశిజ ముఖిరో వినవే
త్వరపడినను కష్టదశలు తలగునె జన్మాం
తర దుష్కృత పుణ్యంబులు
హరి హరులకు దప్పబోల వనుభవమగునూ.

వ. గాన కొంత కాలం బోర్చుకొనుము సాధ్వీ. నాథా! నేనోర్చుకొనునది నోర్చు కొననిది మీ మనంబునకే దెలియును.

చ. పరమ మునీంద్ర మంత్రముల పావనమూ జడబట్టి యీడ్చియా
కురుసభ కేకవస్త్రయని కొంకక మీరలు జూచు చుండగా
పరుసత మానభంగమును పల్వుర సన్నిధిజేయు దుర్మతిన్
దురమునదృంప నీమదికి దోచదు నా బ్రతుకెంత నీచమో.

వ. నాథా అరి భయంకరులగు మీ రేవురు పతులుగలిగియు ఘోరాస్త్ర ప్రయోగ ప్రవీణులయిన కుమారులు గలిగియు పదునాలుగు భువనంబు లుదరంబుననెదిగియుండు మధుసూదనుండు తోబుట్టువై యుండియు నన్నట్లు బెటుతనంబు నరదట్టడిచేశిన దుష్టాత్ములు నష్టంబు గాకుండుటకు నామనంబున వగచెదగాక నేనేమి శేయుదాన.

సంధి—అని ద్రౌపది పలుకుచున్నంత భీముండు కోపంబుతో పాండవాగ్రజుం జూచి యిట్లనియె.

క. తరుణిని దుర్మదమున తన
కురు లెక్కగ సన్న జేయు కుటిలుని నిపుడే
కరకర నమలక తినియెద
కురువర నాకాజ్ఞ యొసగు కరిపురి కేగన్.

వ. అన్నా మదగజంబుల బొదవు కొదమ శింగంబువలె గదిశి నదయులగు ధార్తరాష్ట్రుల మెదడులు చిదురులుగా, మద్గదచే పృథివి పాలుచేసి, యీ సుదతీ రత్నంబునకు ముదంబొదవించెద శలవొసంగుము ధర్మజా

ధర్మరాజు వాక్యం.

అయ్యో శాంతినొందిన భీమశేనుని వస్త్రాపహారణ ప్రస్తాపంబుచే ద్రౌపది నితనిన్ మరల కోపపరుం జేశె నితని కోపంబెట్లు చల్లారునో కదా॥ భీమసేనా సోదరా,



గీ. నీవు కోపించి గదబూన నిలచువారె
రణమునందున నలధార్తరాష్ట్రి బలము
నీరు శేయవె పాండవుల్ మేరదప్పి
రనుచు నిందింపరే సరిఘనులు వినగా.

వ. గాన కోపంబుపసంహ్వారించు భీమా.

భీ—చిత్త మాలాగే ప్రవర్తించెదను.

మాటలు—సంధి.

ద్రౌపది మనంబున అక్కటా యీ ధర్మ ప్రభుండు తాను నరివధంబున కరుగకుండుటయె గాక పోవదలచు సహోదరులను వారించుచున్నవాడింక నేనేమి సేయుదాన నయినను యీభీమ పార్థుల ప్రార్థించి చూచెద.

ద్రౌపది దరువు జంఝూటి రూ.

పార్థ భీములారా యీ పార్థివేంద్రుడూ యీ పార్థివేంద్రుడూ
మిము వర్థిలానిడూ॥ పార్థ॥
మేటి వీరులనుచు వారిమాట మీరడూ మాట మీరడూ
యిచ్చోటు వీడడూ॥ పార్థ॥
నీచు లటుల వలువ లొల్వ జూచుచుండెనూ జూచుచుండెనూ
మిమ్మాచ మానెనూ॥ పార్థ॥
ధరను తమ్ములూరి రాముడు కరుణదప్పెనూ కరుణ దప్పెనూ
మనకీ కష్ట మొదవెనూ॥ పార్థ॥

మాటలు—సంధి.

భీమార్జునులు—ద్రౌపదితో.

గీ. పరమ సాధ్విరో యీ ధర్మపరునివలన
లోకములు నిల్చునట్టి సుశ్లోకుడితని

యాజ్ఞ మీరంగజాల మీయవనియందు
ధర్మపరుడంచు కీర్తిసిద్ధరణి వెలశె.

వ. గావున సుదతీ యీ పృధివీపతి యనుగ్రహంబునకు మే మందరము విధేయులము మమ్ము నీవీరీతిదూరిన మేమేమి జేయువారము ద్రౌపతి హా నామాటలు యెవరికి రుచింపవాయె నేమి దుష్కాలంబు సంఘటించెను పాండవులు ధర్మంబును వదల జాలరు కదా.

ధర్మజుండు.

ద్రౌపతి ఖిన్నమతియయ్యో యీ బిడ నూరార్చెద.

గీ. కాంత మనకిది కాలంబుగాదు గాన
కాని కాలంబుననుపనుల్ గావు శేయ
సమయమగు డెల్ల శత్రుల సంహ్వారించి
సుఖము జెందెద మొగవకు సుందరాంగీ.

వ. ఇంతీ నీవిటు చింతింప మాయంతరంగంబుల కత్యంత సంతాపంబు వాటిల్లుచున్నది గాన శాంతి పొందుము ద్రౌపదీ అనిన.

నాధా—నా విన్నపం బాలింపుము.

ఉ. నీవు క్షమింపగా నకట నీదురవస్తల సంభవిల్లెనా
జా వివిధాస్త్ర శస్త్రముల యర్జునుడుర్ గదచేత భీముడుర్
ధీవిమల ప్రతాపముల దివ్య సభాంగరణంగమందు
దుర్భావుల ధార్తరాష్ట్రులను బల్విడి ద్రుంచరె జూద మప్పుడే.

వ. నాధా సకల సౌభాగ్య సంపదలకు నిలింప నగరంబునకు సరియగు నింద్రప్రస్తపురంబు శత్రువుల కొసంగి గారాబు కుమారులగు ప్రతి వింధ్యాదులను ద్రుపదుపురంబుననుంచి యీ ఘోరారణ్యంబుల కూరగాయలు నమలి క్రూర మృగంబులం గలసి కష్టంబులను పొందవలసె గదా ఇంకనైనను శాంత గుణంబుల న్విడచి కర్ణా శకుని దుర్యోధనాది దుష్ట లోకంబు నష్టంబు గావింప నీ సహోదరులకు అనుజ్ఞ యొసంగుము ప్రాణేశా అనిన ధర్మజుండు ద్రౌపతిం జూచి.



ధర్మరాజు దరువు హిందుస్తాని—చాపు.

యింతగా ననుదూరనేలా దంతిగమానా వంతువచ్చువేళ నను భవింతు రెంత వారలైన॥ యింత॥

కాలగతి త్రిశంక భూపాల సుతుండడలడే ఆలినమ్మి కాశిపురిని మాల కొలువు గొలువడే॥ యింతగ నను॥

వంచన సతియర్ధవస్త్రము జించికట్టడె కొంచగాడె నలుడు పడి పంచ నుండడే॥ యింత॥

ధరణీలో వర తమ్మలూరి ధాముడు శ్రీరాముడూ తరుణిని గోల్పోయి వానరుల నాశ్రయించడే॥ యింతగ॥

యిదియునుం గాక.

గీ. గురు పితామహ కృపులునర్ గూర్చి
సత్య వచనుడని సంతసింతురు వారి జాక్షి
ప్రాణహానియు గలిగిన పాడిదప్ప
నెల్ల కోపంబు నుడుగు నీ యుల్లమందు.

వ. ద్రౌపదీ ఆపదలు వదలక కాపురంబులు సేయునా యీ కష్టంబుల కోర్చి అరణ్యాజ్ఞాతవాసంబులు మేర దప్పకుండా నెరవేర్చుకొనిన యనంతరంబ నీకపకారంబు జేశి కుపధ ప్రవర్తకుల జయించి రాజ్యము చేకొనియెదము కష్టంబు లొందవెనని వగవకుము.

ద్రౌపది మనంబున అయ్యో యీ మహాత్ముని నింక నింతకంటె నిర్భంధించ కూడదు మనస్సున కెంత ఆయాసంబు గలిగించితినని ధర్మజుం జూచి నమస్కరించి ప్రాణేశ్వరా.

గీ. మీకు లేనట్టి కష్టంబు నాకు గలదె
గురు పితా మహాసన్నిధికుచ్చితులచె
భంగ మందితిగాన నప్పాపమతుల
భండనంబున దెగటార్ప బడుటకంటె.

వ. యింతియె కాని అతి సుకుమారులగు మీకు లేని వనవాసా

యాసంబు నాకుగలదె మీ పాదసేవ నిరంతరము జేసి నావలన మీరు సంతుష్టులగుటయె నాకు దేవేంద్ర భోగంబు నాయజ్ఞానంబు సహించుడు మీ మనంబులకు రుచించిన తెరంగున మెలంగుడు నాథులారా.

స ం ధి.

ధర్మజుండు ద్రౌపదిం జూచి సంతోషము సంతోషము నా మనంబునకు చాలా ఆనందంబుగలిగించితివి॥ సతి॥ సుగుణమతి॥ సంధి అని యిట్లు పాండవులు వెనుక తాముపడిన యవమానంబు దలంచుకొని తత్సంభాషణంబు లాడుకొనుచుండిరంత నచ్చటికి క్రోశ మాత్రాంతరంబున నున్న మునిపల్లెలో సోమయాజి యిదేమి ఆశ్చర్యంబు రోజు రాత్రికాలంబు జనుదెంచు మృగంబులీ దివసంబు పగలే వచ్చుచున్నవి. సమీపంబులో సింహ గర్జితంబు వినబడుచున్నది వరే రామశాస్త్రి రండోయి.

దర్వ్య-బ్రాహ్మణుల సంవాదం-శం-జుల్వ.

ఓరి కాపురమెట్ల జేతమురా కడ తేరెమార్గంబేదో గానమురా రారవెంకటశాస్త్రి రారతిమ్మాభొట్లు రారరామాజోషి రారదీక్షితుల్ యిారీతి మృగములూ దారులూగొట్టుచూ మీరికుటీరముల దూరుచుండేనింక- ఓరి-౧.

మాటలు. అయ్యో మన స్త్రీలందరు నదికి స్నానార్థంబుగా బోయిరే అని పెద్దగా.

దర్వ్య. ఓసీవెంకిరావే ఓసీక్రిష్టిరావే- ఓసి శేషీరావె-ఓశి తిక్కామా- ఓసి యల్లదె పల్లెడాశి సింహాము కేక- వేసెప్రాణామోస మాశయుండాదింక- ౨.

కోరి రాఘవరావు కోర్కెదీర్చితమ్మ ! లూరి సీతారాము చేరివేడుచునూ- ధారుణిలో పెద్దలేరుపరచినవనితీర నేటిరుణామేరు రక్షింతురు- వోరి.

యెంతకాలంబయినను మనమొరాలించే భూపాలుండు లేడాయె.



పట్టణప్రాంతంబులకరుగుదమనిన పెద్దలనాటినుండియున్న స్థలంబని పుణ్యాశ్రమంబని విడువ మనంబుజొరదాయె. నింక జరుగువిధంబు యెట్లో తెలియదు. మనపరికరంబులన్ని మొన్నటిరోజు మర్కటశూకరంబులు గొంపోయె. నాహా యేమికాలంబు అనిన సోమయాజులం జూచి రామశాస్త్రి ఓహో నేను మరచితి నొకసదుపాయంబున్నది.

ఉ. ఏటికిచింత జూదమున నెల్ల ధనంబులనోడి దీనులై
బోటిని వెంటబెట్టుకొని పుణ్యవనంబులు సంచరింతురి
వ్వీట నెనున్న వారు తృణబిందునియాశ్రమమందు పాండవుల్
మేటిబలాస్త్రశస్త్రముల మిన్నకదృంతురు వారివేడినన్.

మాటలు——యేమీరామాశాస్త్రి పాండవులా ఈ మన తృణబిందుఆశ్రమంబులో యున్నారు. యెంతపుణ్యులు వారిసొమ్ము నొకసంవత్సరంబు రాజనూయకాలమందు అనుభవించినవాడ. అహా ద్రాపది వచ్చియున్నది. ఆమహాతల్లిని చూచైనారావలెను. వారు బ్రాహ్మణరక్షకులే. అయితేయికమృగంబులకు తెగుకాలంబు సమీపించినదిలె. నిజముగా నీవు చూచితివారా. జగన్నాథసోమయాజి మొన్నటిరోజు ద్వైతవనంబునందుండి మన మునిపల్లెకు వచ్చుచు మార్గంబున వారలున్న పుణ్యాశ్రమంబున నారాత్రి వారలతో గలసియున్నవాడా.

క. ఏమని చెప్పుదు వారలు
భీమబలులు శతృలోకభీకరు లార్యుల్
యేమోయనబోకుడు పా
దాముపదం డందరము సుధర్ములకడకున్. వ. అనిసోమయాజి.

వ. ఓ కాంతలారా మేము పాండవులకడకరిగి మనవెతలు వారలకెరుంగించి మృగవధోత్సాహకులగావించి మధ్యాహ్నమునకు తిరిగివచ్చెదము. మేము వచ్చునంతవరకు మీరలు కుటీరంబులలోనే యుండుడు. వెలుపల కరుగవలదు. బహుజాగ్రత. మృగములు తిరుగుచుండడము తెలుసునుగదా పోయివచ్చెదము.

అని వారలు తృణబిందుని యాశ్రమంబు సమీపించి పాండవు లం గాంచిన.

మాటలు—వందనంబులు భూసురులారా. జయోస్తు. యీ కృష్ణాజినంబులపయి గూర్చుండుడు. బ్రా. రాజా కూర్చున్నట్లే. మా స్థితి విచారించుడి.

బ్రా. దర్వు- శంకరాభరణము- ఆది.

రాజ ధర్మరాజా రవి తేజా మునిపూజా- రాజ - భోజశత్రుజన రాజఖండితా- నీజయధాటిజగద్వేటికరాటి- రాజా-౧. శతాయుష్యమస్తూ - స -త్సతీసమేతోస్తు- హితానుతా సోదరాశ్రితా- సంతతీవృద్ధిరస్తూజయోస్తూ- రా- ౨. భీమవిక్రమో స్తు నీతో రామప్రసాదోస్తు-సామజాదిబలసంఘహితసర్వ- భూమిపతిత్వోస్తు-సంకల్పసిద్ధిరస్తు-రాజా.

వ. ధారుణీవల్లభా తా మింద్రప్రస్థపురంబున జగద్విఖ్యాతంబుగా నాచరించిన రాజసూయయజ్ఞంబులో నొకవత్సరంబు తమ పజ్తిన యథేష్టముగా భుజియించినవారము. యీతల్లి మాకొసంగిన వస్త్రపాత్రాది బహుమానంబును పెట్టిన భోజనంబును మరువు రానేరము. మీరలు మరచినను అనుభవించిన మాకు జ్ఞప్తి తప్పదు. అట్టి మిమ్ము గంటిమి. మీకు దుర్యోధనాదులు జేసిన అపకారంబు లప్పుడప్పుడు శృతంబగుచున్నవి. గాని మీర లిచ్చటయుండు టెరుంగము. మీ కపకారులగువారలు స్వల్పకాలంబుననే నష్టంబగుదురు. గాని మాకిపుడొక గొప్పయాపదగలిగి యిందుజను దెంచినవారము రాజా.

గీ. ఎంతకఠినమైన నేనాచరింతు మీ
కెవరివలనగలిగె నేమికష్ట
మెరుగబలుకుడవని సురలకునగుబాధ
యుడుపకుండువాడు పుడమిపతియే.

అనిన బ్రాహ్మణులు ధర్మజుంజూచి.

ఉ. ఏమనిదెల్పువారమిదె సెక్క డజూచినలెక్క-లేకయుగ్ర



తాముపరాక్రమంబులను దందడిబెట్టుచు ఘీంకరించుచుగ్ర
సామజభల్లుకాది మృగసంఘము లొక్కటగూడి ధౌర్మ్యగా
మా మునిపల్లెదూరె భయమందిటువచ్చితి మాదరింపవే.

వ. రాజా రాత్రికాలములందు కుటీరములువిడిచి వెలుపల రానోపమైతిమి. యిడియునుంగాక మర్కటముల బాధ చెప్ప నలవిగాదు. పగలు మేము జపసమాధియందుండ మందిరములలో జొచ్చి స్త్రీలు వెరగుపడి చూచుచుండ మావస్తువులు గొంపోయె.

దర్వు-శంకరాభరణం-చాపుతాళం.

యేమిసేయుదుమూ రాజా యెందుబోయెదము - మేము జేయు సుకృతంబునమీరీ- భూమికొచ్చితిరి యోమహాత్ములారా - యోగదండమును దర్భాసనమును- యాగపుస్తకము లాగుకపోయెను- యేమి-మరివకరు. మహారాజా నాస్థితివినుము - మించుజంధ్యముల సంచిబోయె సన్న- పంచబోయె బహుమంచిదిగట్టిది - రాజా చాలాకష్టము నాదే.

అడ్డరేఖలుగల దొడ్డది సాళగ్రామ గుడ్డబోయెను రాగి బుడ్డిచెంబుబోయెను- యే.

వ. మహాప్రభో నేను వుపాదానమెత్తుకొని ఆపల్లెలో చదువుకొనుచున్న వాడను.

భిక్షాపాత్రబోయెను కమండలాబోయెను అక్షింతలబుర్రా నిక్షేపముబోయె- యే.

వ. యో పుణ్యపురుషా నియతాహ్నికుండ నా మొరాలకింపుము.

నేవేళ రాఘవరావుప్రోచురామ దేవుడుండు నా దేవతార్చన బోయె- యే.

వ. అనిన ధర్మరాజిట్లనియె.

ఓ భూసురులారా, యీస్వల్పకార్యంబేన. మీరువిపత్తు నెరవేరిన దనుకొండి యింక.

దర్వు-జంఝూటి-ఆది.

భయముజెందాకుడు - సాధులారా - భయమేలభూసురలారా-
భ. చండమృగమూల చెండాడెదామూ - వాటీ - కొండాగుహాలందూ
దరిమేదామూ- భయ-

పెద్దపులులాఖండించీవై చేమూ-బహు-కొద్దీటెనీడ్చి తెచ్చేమూ-భయ.

పోతుసింగముల బాతీవేతూమూ - అడవి - జాతార జేసీవత్తూ
మూ- భయము.

తమ్మలూరీధామూన దాలంతూ - మిమ్ము సమ్మతీజేసీ మెప్పిం
తూ- భయమూ.

వ॥ అనిన బ్రాహ్మణులు.

క. ఎడలేదువేగలెండీ
తొడగుడు వర్మములు చాపతూణీరులరై
కడగిమృగసంఘముల వెం
బడిబడి బడవై చుడిపుడె పార్థివులారా.

వ. మేమాశ్రమంబునకువచ్చెదమని చెప్పివచ్చితిమి. అగ్నిహో
త్రంబులు చేసుకొనవలయును గాన నింక నరిగెదమురాజా.

మాటలు—ధర్మరాజు వారలంజూచి.

చ. వెరువకుడార్యులార బలవిక్రమధైర్యజితారులైన సో
దరులును తోడురాగ నతిదర్పసమగ్రత కాననంబులో
నరశి మృగాళ్లినీదునిమి యందరిబ్రోచెదమింక వేగ మీ
రరుగుడుయాశ్రమంబులకు నాహ్నికకాలముమించకుండగన్.

వ. అనిన వారలు ధర్మనందనా మీకు జయంబుగలుగుగాక.
మేము వెళ్ళివచ్చెదము. అని వారలు జనినయనంతరంబా.

ధర్మరాజు తమ్ములంజూచి.

మత్తేభవిక్రీడితం. వినుడీసోదరులార యీయడవిలో వేదండభల్లూకసిం
హానికాయంబులుగూడి యొక్కమొగమై వారింపగానోడకన్



మునిసంఘంబులబాధసేయుచును సమోమ్మదంబుతోనుండెదుర్
మినమాదుష్టమృగంబుల న్నరములన్మర్దింపగా బోదమా.

అనిన భీమాదులు ధర్మరాజుంజూచి.

వ. బహుకాలంబునుండి వేటలాడకుంటిమి. లక్ష్యంబులు దప్పు
గాన నీక్షణంబ మనయరదంబులెక్కి యింద్రశేనాది సారధిసహితంబు
గా జని మృగంబుల వధించి వేగంబ యాశ్రమంబున కరుగుదెంతమగ్ర
జా. అనిన, ధర్మరాజు తమ్ములారా మంచిది రథంబులెక్కుడు.

(ద్రౌపదింజూచి).

వ. భామా మే మేపుర మరణ్యంబునకరిగి కురంగమాంసంబు
నుం గొనివచ్చెదము. ఆశ్రమంబున బహుజాగ్రత. నొంటరిగా నెచ్చటి
కేగకుము. పర్ణకుటీరంబున నేధాత్రికసమేతంబుగా నుండుము. ధౌమ్య
మునీంద్రుండు మౌనముచే భగవధ్యానంబుననుండు. మేము వచ్చునంత
వరకు నప్రమత్తవై యుండవలయు పోయివచ్చెదము. ద్రౌపది పో
యిరండు నాథులారా.

ధర్మరాజు- సోదరులారా.

గీ. ఏను దేవేంద్రదిక్కున కేగువాడ
సురపతికుమార నీవేగు వరుణదిశకు
పావనీనీవు దక్షిణపథముకరుగు
జనుడు సహదేవనకులుడు సౌమ్యదిశకూ.

వ. అని నియమించి వారలందరు నొక్కట రథంబులెక్కి కొం
తదూరంబరిగి యరణ్యంబుగాంచి యచ్చటచ్చట దృగ్గోచరంబులగు
మృగంబుల సోదరులకుంజూపి ధర్మజుండు తమ్ములారా.

దర్వు-కమాచి-ఆది.

శరభసింహంబులూ- కరిభల్లూకంబులూ- శరబృందాములసోద
రులార దృంచుడూ-

ఉరుపుండరీకములల్ - పరుగెత్తెనేకముల్ - సరుగుడద్దము వాటి - యురవాడిగండములా.

మాటలు—తమ్ములారా మన రథంబులధ్వనివిని చల్లాచెదరగు చున్నవి.

దర్వు. చదరాకుండాగనూ- పొడవూడందారునూ-నదె వృక్షా గుల్మములాల నెదిగెగుంపులునూ॥

తమ్ములూరిశూనీ- నమ్ముడూమాదీని - దొమ్మిగానీటాలాచే గృ మ్ముడూవాటీని. అనిన తమ్ములందరు ధర్మజుంజూచి.

క. ఒక్కటియునుజిక్కకను నలు
దిక్కులకును బారుచుండె తెగి మొత్తంబై
యిక్కడ మనముండకనలు
దిక్కులకరిగినమృగాళి దివమేదారుకుర్.

వ. అట్లేని తమ్ములారా, మొదట బయలుదేరునప్పు డాశ్రమం బున నియమించుకున్నరీతి మన మాయాదిశలకరిగి సమస్తమృగంబు ల వధియించి మధ్యాహ్నమున కిచటికరుగుదెంత మందరము మొత్త ముగా నాశ్రమంబున కరుగవలయు. ముందుగా నెవ్వరిచ్చటికివచ్చినను అందరు గలయునంతకు నిక్కడనేయుండవలయు. ప్రొద్దెక్కె పదండు. అని పాండవు లాయాదిశల కరిగినంత.

సైంధవుండుప్రవేశించి.

సఖులంజూచి యీయరణ్యం బెంతదూరంబునడచినను అంతు లేకయున్నది. ఆహా యేమీవృక్షంబులు. సూర్యప్రకాశంబు మరుగువ డ జేయుచున్నవే.

దర్వు-శంకరాభరణి-ఆది.

నింబకుచసతింత్రిణీకదంబశోకముల్ - జంబుజంబీర పాటలారంభవ కుళముల్.



నారికేళఖర్జూరతాళచూతవృక్షముల్ - మీరిగగనమందుకొనగ బారసాచుశాఖలుర్.

వ. ఈ యుగ్రాటవి దాటునంతవరకు సైన్యంబులుచెదరకుండా పొదవుకొనిరండు. అని కొంతదూరంబరిగి నెచ్చెలులారా సిచ్చటికొక క్రోశడుదూరమున బయలుగాన్పించుచున్నది. అందు పథాయాసము దీర్చుకొని యనంతరం బావలబోవుదముగాన రథంబులు త్వరితముగా రానిండు. అని యరుగుచుండ. ద్రౌపది యాశ్రమంబులో నుండి

వ. ఆహా యెక్కడనో సైన్యకోలాహలములు వినబడుచున్నవే. వెలుపలకరిగి చూచెదనని పర్ణకుటీరమునుండి బయలుకుజనుదెంచి కదంబశాఖ హస్తముంబట్టుకొని సైంధవుబలంబుల నాలోకించి.

దరువు - శంకరా - చాపు.

అయ్యో పరబలంబు లగుపడెంగదా యీయరణ్య మధ్య మునకు నెచట నుండి వచ్చెనో॥ దయ్యో॥
పృథివియదరె పక్షితతులు బెదరి చెదల కెగశెనే॥ దయ్యో॥
నొంటిరిగనుంటి నాథు లింట లేని సమయమయ్యయ్యో
ధరను తమ్ములూరి రామా కరుణలేక నేడిం॥ దయ్యో॥

వ. కానిమ్ము బలంబు లెటుబోవునో యీ తరువరంబు క్రింద నుండి చూచెద.

అట సైంధవుండు సైన్య సమేతంబుగా నాశ్రమవనంబు సమీ పించి ప్రియులారా.

సీ. మకరంద వరపాన మత్త చిత్తంబుల చలరేగి ఝంకృతుల్ సలుపు తేంట్లు। ఫలములు మెసవియు కలశినెండొంటితో కలకల బలికెడు చిలుక గుములు। నవ పల్లవంబులు నమలిదంపతులుగా కూడి యాడుచు బాడు కోకిలములు। సలలిత షడ్జమస్వరము లపించము ల్కికురించి యాడు కేకీవ్రజంబు। పథికజనముల మనములు పల్ల వింప। జేయు జాలిన మందసువాయువులును గల్గి వేడుకబాడ

మెడు ! గనుగొనంగ నివ్వనలలామ నేరిదో నెరుగవలయు.

రాజేంద్రులారా పురందరు నందను వనంబుడిందుపరుపంజాలి నాడెందంబున కానందంబొనరించు నివ్వనంబున నెవ్వరుందురో చూతము.

అని కొంత దూరంబరిగి ఓహో, అచ్చట పర్ణకుటీరంబులు గాన వచ్చుచున్నవే ఆహా అల్లతరువరంబు క్రింద నొక మెరుంగుబోడి మెరయుచున్నదే దండనాథులారా మన దళంబుల నిచట దివియ నియమింపుడు గోటకాస్యా చూచితివా.

చ. కలువలకేరు కన్నులను కార్మొరుగుల్ దులకించు మేను ని
ర్మల శశిబోలు నెమ్మొగము మానితపల్లవపాణి యుగ్మముల్
గులుకుమిటారి గుబ్బలును కుందములన్ హసియించుదంతముల్
వలపుల దీవిమోవిగల వయ్యరి నొక్కతెగానుపించెడున్.

వ. గోటకాస్యా క్రొక్కారు మెరుంగు వసుంధరకరగు దెంచినదికాబోలు. భూవరా! కాదు ఆకాంతయవ్వరో నవమోహనాంగి యగు భామ కాబోలు. గోటకాస్యా! ఏల నుడివెదవు భామగాదు.

ఉ. చిత్తరుబొమ్మ యచ్చెలువ చెల్వముగన్గొన దేహ మంతయున్
తత్తరమందె మన్మధుడు తాళగ నీడదె పుష్పబాణముల్
మొత్తముజేశి గాఢముగ ముంపదొడంగె నికెట్టులోర్తు న
మ్మత్త గజేంద్రగామినిని మానక కౌగిటజేర్పకుండినన్.
వ. గోటకాస్యా అది బంగరు బొమ్మకాబోలు యట్లనిన.

క. వనజాయతలోచన మో
హన సుందర మేనికాంతి నతి చిత్రంబౌ
కనక మయంబులుగా ని
వ్వనమంత వెలింగె నహహావశమే పొగడన్.
వ. యిట్టి సుందరి నెందునుం గాన.

దరువు - కమాచి - ఆది.

వహ్వారే పువ్వుబోణి యవ్వరో వహ్వా
నాకు నువ్విళ్లూరు దాని ముద్దునవ్వు మోముజూడ॥ వ॥



తుమ్మెదలను బొమ్మి శేయు వేణి అల్ల
కమ్మవిల్తు మెరుగుసాయకమ్మనదగును॥ వహ్వారే॥
కెంపూ సొంపూ మాయింపూ కెమ్మోవి
ఘన చంపాకంబును తిరస్కరింపనగు నాశికా॥ వహ॥
గున్న హారులా మీరు నెన్నడూమూ మేను
వన్నె చిన్నగన్న ధృతిసన్నగిల్లుచున్నాదే॥ వహ్వా॥
భూవియందున చింతలపూడి రాఘవ
గాపు బ్రోవు తమ్మలూరి దేవు కృపయెట్లుందో॥ వహ్వారే.

వ. ఘోటకాస్యా స్త్రీరూపమే కాని. ఘోటకాస్యుండు.

ఉత్పలమాలకా విక్రీడితవృత్తము॥ పన్నగ భామయో యమర భామయొ కాముని ముద్దుగుమ్మయో కిన్నరసుందరీమణియొ క్రీడజరించు వనాధిదేవతో యున్నలినాక్షి మానుషపు యింతయొగాని యథార్థమేకతం బున్న తెరంగెరింగి ముదమొందగ కోమలీ దెమ్ము భూవరా.

దరువు - శంకరాభరణ - చాపుతాళం.

అదె కనుంగొను రాజసుతా అల్లదె కనుంగొను రాజసుతా॥
ముదంబునను తన కెంగేలన్ కదంబశాఖన్ గదలించెన్
పదంబులెత్తుచు నిటుజూచెన్ సుదాతినలవృత్తము నీడన్.

సై — త్వరితముగా నీవటు బొమ్మ నెరుగుము నాసతిచేరి తెమ్మా
తరుణిని శేయుము నాసామ్మా మరువను నీయుపకారమ్మా॥
సారసముఖి యిటురాకున్నా మారుడు నిలువగ నీడన్నా నారీ
రత్నము మనకున్నా వేరే స్వర్గము లేదన్నా॥ రాఘవరావును
నేలిన యా మోఘాస్త్రుడు మనయందు దయా బాగుగ నుంచిన
భామకుయా భ్యావంతుడను నేనగుదునయా.

వ. గోటికాస్యా యాపాటలగంధి నాకు మనో నాయకియైన త్రిలోక రాజ్య సుఖంబనేక సుఖంబు లనుభవించుచు నేలునట్లు నంత

శించనే తుంట విల్కాని బంటుగాజేసుకొని కంటికింపగు నవ్వాలు గంటితోననంగి పెనంగెదను గాన.

దరువు - శంక - చాపు తాళం.

పోమ్మా భూవరా ఆసతినిటూ దెమ్మా సచివరా
సమ్మాతిగను నాదువృత్తమ్మా దానికెరుగదెల్ప పొమ్మ సచి
కలుగురాజ్య సుఖములు తన ఫలితములని తెలుపు పో పొమ్మ
తమ్మలూరి రాముదలచి నెమ్మతిగను దానికడకు పొమ్మ॥

వ. గోటకాస్యా మేమీా కమలాకరంబు సమీాపంబుననే యుండెదము. నీవు వేవేగయవ్వారిజానన కడకరిగి యెవ్విధంబున నైనను కార్యసిద్ధి గావించుకొని రమ్మ.

సింధు భూపాలా అమ్మందగమన చందంబెట్టిదో తొందర పడకుము సాధారణ మగువగా నగుపడదు. పోయి వచ్చెద నని గోటికాస్యుండు వచ్చుచుండ ద్రౌపది వృక్షంబు క్రిందనుండి.

ద్రౌ—బలంబులన్నియు నచటనేయుండి నొక చపలుండిచట కరుగుదెంచు చున్నవాడు కాననంబున పతులెంత దవ్వున నున్న వారలో ఎప్పటి కరుదెంతురో నేనొంటరిగా నాకంటకుని కంటకగపడితి నేమిగతి సంభవించునో కదా హా అన్నా కృష్ణాదేవ రక్షింపు రక్షింపు.

దరువు - హిందుస్థాని తోడి - ఆది.

కామకోటి సుందరాంగా భీమ విక్రమ శత్రుభంగా రాక్షస దనుజవిరామా తారకనామా శ్రీహరీ॥

పరమ పురుష భక్తపాలన దురితహరణ పతితపావన గరుడకేతనా ఉరగశయన సరశిజానయనా॥

నన్ను తామరపోవ రావ నిన్ను నమ్మితి బ్రోవలేవా మున్ను అక్షయ వలువ లొసగి నన్ను గావవా॥



ధరణిజా మనోహరా మురహర కరుణాకరా పరగ తమ్మలూరి పురీవర పరాత్పరా॥ కామ॥

వ. దాసజన హృదయోల్లాస రాసక్రీడా విలాసా నాకేదోసంబు ప్రాపింప కుండునట్లుగా కాపాడవే దయానిధి అనుచుండ. గోటకాస్యుండు చనుదెంచి మెల్లగా.

క. సరశిజ ముఖి దారుణ భీ
కర హరిశార్దూల ఖడ్గగజవానరసూ
కరమృగ సంఘంబులు గల
దురితాటవి నొంటి నుండు తొయ్యలి వెవరే.

వ. నీ రూపంబుజూడ నానందంబగుచున్నది నీవుండు స్థళంబు గనుంగొన దుఃఖంబు బొడమెడు హా.

సీ. కమల సంభవు రాణి కాంతారమునుజేరి విహరించు పలుకుల
వెలదివేమొ। నందకధరుయురమందుండ కనుగ్రీడ సులుప నేతెం
చిన చెలియవేమొ। త్రిదశాలయ సుఖంబువదలి యేకతమున
దిరుగ బూనిన శచీదేవివేమొ। ధరణి యాకృతినిల్పి తరుణి రూప
ముదాల్చి నడవిగన్గొనెడు భూపడతివేమొ। కాము భామవో
సోముని కాంతవేమొ। లేక వనదేవతవొ యిట్లుగాకయున్న నిట్టి
సుకుమారతయు నేర్పులితరయువతు లందు గలుగునే దల్ప
పూర్ణేందు వదనా.

మాటలు.

మనుష్య సంచారంబులేని యీా గహనంబున నేకతంబయున్న కారణం బేమి.

గీ. నిన్ను వరపుత్రిగా గన్న ధన్యుడెవడు
నిరత సుఖముల నినుగూడు పురుషుడెవడు
నీదు నామము వినియెద నీరజాక్షి
శబ్దమెయ్యది నిక్కము జెపుమ దెలియా॥ అనిన ద్రౌపది.

దరువు - హిందుస్థాని - ఆది.

అన్నయ్యా యెవ్వరితన యుడవయ్యా నీవున్న దేశంబేదో దెల్పుమయ్యా॥ నన్నుతాంగ యెంచూ జనుచున్నవాడవు ఘోరకాంతార సీమలోపలనూ జేరి యేకతమయున్న దాననూ మేరమీరి యిందు రాతీరుగాదయ్యా॥ అన్నా॥

ధరను తమ్ములూరి హారినీ మరువక దలచెదను మదినీ పరమ పాతివ్రత్యవ్రతము నెరుపూడూనయ్యా॥ అన్నా॥

ఇవ్వనంబున నేకతంబయున్న నాకడ కెందు నిమిత్తంబరుగుదెంచితివి ముందు నీచరితం బెరింగింపుము. అనిన గోటకాస్యుండు.

ఉ. భామిని నాతెరంగెరుగ బల్కెద సర్వము నాలకింపు స
ద్ధామ పరాక్రమప్రకట దర్పుడనే శిబివంశజాతుడన్
నామము గోటికాఖ్య జననాయకుడన్ సురథుండు తండ్రియా
సామజ ఘోటకాది బలసంఘములెల్లను సింధు సైన్యముల్॥
వారల వేరువేరుగా వివరించెద నాకర్ణింపు.

దరువు - శంకర - ఆది.

పుండరీక నయనా గను కొండలంటి మత్తవేదండ తండామూల నడుమనుండు బలుడు కాళింగమహామండలుడు ద్దండుడతడు॥ పుం॥ కనక రథమునందు వెలుగు ఘనుడు క్షేమంకరుడు విదు గనుగొనుము సాక్కు నతడు వినుతయశుడు సురథ నృపతి॥ పుండ॥

ఘూటుకా సౌవీరకుమారులు పన్నిరువురు జేరి కొలువ మత్తకరిపై వీరుడగుచూ ధారుణీ తమ్ములూరి విహారునీదలచుచు మెరయు మారాసమాకారుడరి వీరుడడుగో సైంధవుండు॥ పుండరీ॥

వ. మందగమనా ఆసైంధవుండు నీచందంబెరింగి రమ్మన నిందుల కరుదెంచినవాడ. నిది మదీయ వృత్తాంతము. ఇంక నీ చరితం బెరిగింపుము.



ద్రౌపదిపద్యం.

క. హితమతులు పాండురాజుకు
సుతులు పరాక్రములు శత్రుసూదనధీరుల్
పతులుగలదాన నన్నిటు
లితరుల ప్రియ మాటలాడు టిదియుక్తంబే.

అన్నా గోటికాస్యా.

దరువు-శంకర-చాపు.

నాతెర గెరిగింతూ ధరణీనాయకావినూ- నీతియుతులు పాండుసుతుల- నాతినగుదునూ-

వినుతయశుడు పాంచాలవిభుడు జనకుడుర్- ననుజసంబు కృష్ణ యనగదనరి నెగడుదుర్-

సుతవతినీధర్మమతిని నితరకాంతగా- మతినిదలచి పెక్కులాడ హితవుగాదికా-

ధరనుతమ్ములూరిపురీ హారిని దలచుచుర్ - సురశనుతుడవగుట నిక్కెరిగి యుండుదుర్.

వ. భూపాలనందనా మత్ప్రాణనాథులు నన్నీ యరణ్యంబునం దుంచి. గీ. పూర్వదిశకు ధర్మపుత్రుండు దక్షిణ। మునకు భీమసేనుడును పడమట। కర్జనుండు కవలు నర్థినుత్తరమును। జనిరి వేటలాడ జనవరేణ్యా.

వ. అమ్మహాత్ములకు మీరు బంధువులగుదురుగదా. బంధుప్రియులగు నాశింధువైరిపరాక్రము లింతకు నరుదెంతురు. వారలు మీకు జేయు సత్కారంబులు గైకొనిన యనంతరంబ యరుగుదురు. వారలొచ్చువరకీయాశ్రమసమీపంబున నల్లకమలాకరంబుచెంత నాతరుషండంబున నివసించియుండుడు. అవి ద్రౌపది కర్ణకటోరము ప్రవేశిం

చిన గోటికాస్యుండు సైంధవుం జేర నతండు గోటికాస్యా యవ్వర ప్పూవ్వుబోఁడీ యెఱింగింపు రాజా.

మత్తకోకిల. ఆసతీతిలకంబువిను పాంచాలనందనకృష్ణయర్
భానురాంగియు పాండవేయులభామ నిచ్చటయుంచియర్
భూసురప్రియులంత వేటకు బోయిరుగ్రాటవులకున్
నానువిక్రములొత్తురింతకు నందరిన్ తానిలుమనెన్.

వ. ఆహా ఆసతి పాండవాంగనా. అయితే సంతోషము. రాజేంద్రులారా మనమామానినిని గొనివచ్చితిమేని కర్ణ శకుని దుర్యోధనాదులు విని సంతసింతురు. పాండవులు ధీరులని వాడుకయేగాని సమరమన్న నమిభయంబు గలవారలు. బలసంపన్నులగుదురేని జూదమున నలనాడు కులకాంతవలువలు వలుచుచుండ కలహామునకు జొరజాలక నిలచి చూచుచుందురా. సకలరాజ్యసంపదలు దుర్యోధనున కొసంగినట్లు ద్రౌపదిని మనకు వదలుదురు. కాక యుద్ధమునకు గడంగుదురేని వనవాసాయాసశరీరుల క్షణమాత్రమున జయింపగలము. అదియునుంగాక నవ్వనజాననతో ననంగిపెనంగ నామనంబు గోరుచున్నది. యెన్ని విధంబులనైనా నాయొప్పుల కుప్పను యొప్పించిగాని యొప్పనిచో బలాత్కారంబున గాని గొనివచ్చుట మంచిదిగా నెంచితిని నాయభిప్రాయంబు యింక మీ మనింబుల తెరంగెరింగింపుడు.

రాజా-క. మునురాడ నూయమునకై
ననిమమ్ముల గెలచి ధనములర్జునుడు గొనెన్
వనజాక్షిని తేవే చను
మనుమానంబేల కయ్యమైనను మేలే.

వ. ఖండనంబగు నేని మాప్రాణంబులు దాపక నేపగిదినైనను నా పాండవుల జయించుదుము గాన నయ్యండజాక్షిని దోట్కొని రమ్ము పొమ్ము. సైం—అయితే రాజేంద్రులారా మీరందరిచ్చటనే యుండుడు గోటికాస్యా పోదము రమ్ము అని యిరువురు నతిత్వరితంబుగా



జని గోటికాస్యా నీవీ కదంబశాఖ మరుంగున నుండుమని సైంధవుండు పర్ణకుటీరంబుజొచ్చి ద్రౌపదిం జూచి.

క. అలికులవేణిరో కుశలమే
సలలిత సద్భక్తి వినయ సంభ్రమములతో
గొలువగ మెలగెదు నీపతు
లలఘుబలుల్ శుభులె తెలియ నానతియిమ్మా.

వ. మీ ఆశ్రమ మునులు పరిచారకులు అందరు శుభముగా యున్నవారా సుదతి.

ద్రౌపది.

గీ. మాకు కుశలము భూనాథ మీకు శుభమే
మత్పతులు వేటకేగిరమ్మాన్య చరితు
లరుగు దెంచియు మిమ్ముల నాదరించి
పూజశేతురనిలువుమో రాజవర్యా.

వ. కురు పాండవులకు బంధుండవగు నీవరుగు దెంచుట్క మత్పురుషులు సంతసింతురు. యీ పాద్యంబుగొని యాకృష్ణాజినంబుపయిం గూర్చుండి కురంగమాంసమును భుజియింపుడు మృగయా వినోదార్థం బరిగిన నా ప్రాణనాథులే తెంతురు. వారునిం బూజింతురు. వారి పూజనలుగైకొని నయనంతరంబ మీ పరిజన సమేతంబుగా నరుగుదురుగాన వారొచ్చు నంతవరకీ యాశ్రమంబున నుండుడు అనిన సైంధవుండు.

ఉ. అంగన నీవొసంగతిథి యర్చనలం బరితుష్టిజెందితిన్
న్నంగజు బాణజాలముల యంగములెల్లను చాలనొచ్చెన
న్నుం గరుణార్ద్ర దృష్టిని గనుంగొను మింకిటకాలయాపనం
బుం గలుగింపనేల నికబోదము స్యందనమెక్కు సుందరీ.

వ. సుదతీ మృదువగు నీపదంబుల రుధిరంబులు బొదల కఠిన శిలలం ద్రొక్కుచు నీరీతి నవయనేల భోగహీనులయి కందమూలంబులు నమలి పాదపంబుల నీడలవశియించి బాధలజెందునట్టి మగల.

దరువు—ఆది.

కాంతలు గోరుదురే యిట్టివారి కాంతలు గోరుదురే

చింతచేత పసులచెంతలజేరియూ కాంతారంబుల కష్టించెడు వారీ కాంతలు.

ధనమణి సంపద బాయాదులుగొన మునులయ్యాడవుల ననయ ముండు వారి కాంతలు గోరుదురే.

ధరణీ రాజ్యము పరులపాలుజేశీ పరగ భిక్షులయి ఫలములు దినువారి॥ కాంతలు॥

ధరను తమ్ములూరి హరినిదలంచుచు సరివారలు నగ దిరిగెడు వారల॥ కాంతలు గోరుదురే॥

వ. అతివా నీపతులగూడి యంత కాలంబుండినను కష్టంబులే కాని సుఖంబులు గలుగ నేరవు. నీపతులరీతిగానే.

చ. కమలదళాక్షి నీవిటుల కానన శీమల కందమూలముల్
నమలుచు పర్ణమందిరములందు వశింపగనేల నింకనా
గమణునిగావరింపు మదిరంజిలకోరినకోర్కులెల్లనీ
కమరుననంత భోగములు నందగవచ్చును సార్వకాలముా

వ. అనిన ద్రౌపది మనంబున అయ్యయ్యో యీతం డన్న యని పూజించితి నీ దురాచారుండు క్రూర కర్మంబునకు జొరదలంచిన వాడక్కటా నాపతులెంత తడవు కరుగుదెంతురో కదా వారలొచ్చు నంతకు నయోక్తుల కొంత కాలయాపనంబు జరిపెదను గాకా.

దరువు - హిందు - పీలు - ఆట.

అన్నా సైంధవ అన్నయ్యవు గావా నన్నీటులాడూటా న్యాయమా అన్నా సైంధవా యిది పల్లవి.

కురుపాండవులొకరూ గూర్చుచెల్లెలానా బరగీన దుస్సలాపతి వీవన్నా అన్నా సైంధవా.



తోడాబుట్టుననను పాడిదప్పినమాటా లాడేదునావంటి తోడూలులేరా- అన్నా సైంధవా॥

సూరూలుసద్గుణా ధారూలూ ధర్మసంచారూలూ మీారలే మే రాదప్పుదురా అన్నా సైంధవా॥

ధరతమ్ములూరీ శ్రీహరినినుతించేడి తరుణీగదాయా నీకరుణించు మన్నా అన్నాసైంధవ అన్నయ్యా సైంధవా॥

ఉ. కోరగగూడునేయిటుల కోరికగల్గిననీకుకామినుల్
రారెధరాతలంబునను రాజులునవ్వగ వంశవృత్తులా
మీారుదురేకులాంగనలు మెత్తురెతుచ్ఛసుఖంపునూతులా
జారుదురేయశంబుజెడు సద్గతిదూరుడవౌదుమానుమీా.

వ. సద్వంశసంభవుండగు నీవే నీతిమాలినపనికి జొరదలంచిన నింక నీతరులెట్లు నిలుతురుగాన యీతలంపులుడుగు.

సైంధ—నాతీ తాతకుతగనేర్పునటుల నీతులుబోధించెదవా ?

దర్వు—శంక. ఆది.

తరలాక్షి రాజధర్మమువినవే సురుచిరసుందర వరకాంతలగని వరుసవెతుకజన దరయనృపులకని॥ తరలాక్షి॥

వనితారత్నములనుమపభోగంబునకై ధరణిని జననమొందిరని॥ తరలాక్షి॥

వావులెన్న నేల మోవిపానకంబీవెగ్రోలెద కేవిమీారనో ధరను తమ్ములూరీ సరశిజనాభుండెరిగిననించుక వెరవుదోచదో॥ తరలాక్షి॥

వ. కామినీ లోకంబున కామంభనుభవింప కామితులను కామంబుదీర్ప బురుషులంగా రెండుజాతుల నాదియందే విధిసృజియించె నెవ్వరివలన నానందముగా సుఖముగలుగునో నతండే నాథుండుగాన నీమాటలవలన ప్రయోజనంబులేదు నీవుసుఖంచుకాలంబు సమీపించి యే నేనగుపడితి నింకభోగభాగినివయ్యెదు సమ్మతిగాలెమ్ము పోదము మానినీ అనిన ద్రౌపదిమనంబున యీపాపాత్మున కెన్ని ధర్మపదంబు

లు బోధించినను రోగికి భక్ష్యభోజ్యంబుల రోగంబు లధికంబులగునట్లు వీనికి దుర్గుణంబు హెచ్చుచున్నది కామాంధుండుగాన సామాన్యవాక్యంబుల జక్కబడఁడు బెట్టిదంపునుడువుల నిక్కటిలుని తిరస్కరించెద.

దర్వు — బేగడ అట.

వినుముసింధుభూవరా బలవద్విరోధముబూన జెడుదువురా॥ ఇనసమతేజుడు ఘనుఁడనఘుడుశౌర్య ధనుడగుధర్మనందనుని మార్కొన హిమ వనగజముగనిడాయజని పిళ్ళనుగనుంగొనబోవుటని నసిలోనిశిత శరంబులను తలదునుము నిక నసుమానపడకుము॥ విను॥

తామసగుణానుద్దామభీముసత్త్వ భీముని నెదురింపగా మది నెంచుట సామజంబును చీరిచంపెడు నామృగేంద్రుని ప్రేమద్రువ్వుటె నామముణభుమ గదచేదేహంబోముకొను నిది నిజమునిజముర॥ విను॥

విలశితాంతరవైరి బలమర్దనుడుధీరు డలఘుతరాస్త్రశస్త్రంబులుగలపార్థుని దలపడుట బెబ్బులినిడాశియు కొలచెవేశియు తలగద్రోయగ వలెననుట నిలపాలగుదువే తొలగిపోవలదు వలదుర॥ విను॥

ఘోరాహవవీరులారూఢకవచులపార విక్రములుజితారులౌక వలతో బోరదుష్టోరగద్వితయము కోరలను జీరగమకించుటె చేరెదంత కుపురికిన్నిక చెడకోరి దుర్గుణసత్యమిదిరా॥ విను॥

ధరనురాఘవరావు నరశిరక్షించు శ్రీధరుడుతమ్ములూరి హరి సోదరియని యెరుగకనునాదరికిజేరితివిర దురాత్మక చక్రధారిచేనొరిగెదవు మరువుమీభ్రమ సరిగాదు సరిగాదుపోర॥ వినుము॥

క. ధర్మవతి నన్నునిట్టుల
ధర్మంబులు బలుకనీకు దగునాబుద్ధిః
కర్మాను సారణీయను
ధర్మమువృథయగున చడ్డతలపునకీడ్చెన్.

మాటలు.

అలీకులీకంబులు తెగుకాలంబునకు మూలుదాల్చినష్టంబుబొందు



రీతి నీకును వినాశకాలంబునకీ విపరీతంబగు గుణంబుగలిగెగాబోలు పాండవావమానంబుజేశి బ్రతుకువారలుగలరె చెడకుము సైంధవా! పొమ్ము అనిన సైంధవుండు.

ఏమేమీ ద్రౌపదీ నీపతులు బలవంతులా ?

దర్వు — శంకరా. చాపు.

ఎరుగనటేవారిమానినీ నేనెరుగనటేవారి మానినీ॥

ఎరుగననుచుబహు వెరపింపబోకుము సురలకువెరువనీ పురుషులెంతవారలు॥ ఎరుగ॥

పంచపతులు గలరంచునెంచెదేమొ వంచించిరణమున చించి చెండాడుదు॥ ఎరుగ॥

శకుని సుయోధనులకునోడి పరదేశకులగు చడవుల నెకచోనుండక తిరుగుటె॥ ఎరుగు॥

పుడమిని చింతలపూడి రాఘవరావు న్కడు వేట్కబ్రోచురాముడురానడలను॥ ఎరుగు॥

ద్రౌపదివాక్యం.

వరే పాపాత్మా ? నాపతులసత్యంబు జగంబుల నిత్యంబుసేయ నత్యంతకష్టంబులకోర్చి నిచ్చట నున్నవారలుగాని శకుని ధుర్యోధనులకు వెరచి యొదిగినవారలుగారు యట్టి సత్యక్షమాశాంతి పరులగు.

దర్వు — శంక. ఆది.

పాండవేయులతూలనాడుదువా చెడిపోదువా॥ పాండ॥

దండిమగలు దండబలులరితండఖండన పండితులు మార్తాండ తేజులు భండనంబున చెండూదురూ శరకాండంబులచేనిను ఘోరశస్త్రవిహారులంచితో దారులాహవశూరులెందున లేరు సరియస్వీరులతో బోర నీకూపుమాపెదరేరా తగదుపోరా॥ పాండ॥

నోరికొచ్చిన తీరువారల చోరతనమున మీరిపల్కెడు నేరవిక ఛీపోర పరసతి గోరాకుసద్గతీ దూరూడవయ్యేదు॥ పాండ॥

కోరిరాఘవరావు సేలిన ధారుణీవరతమ్మలూరి విహారుడగు శ్రీ రాముపదముల జేరుమా కడతేరే దారిజూపుమని॥ పాండ॥

వ. అనిన ద్రౌపదీ? నీపురుషులు ధైర్యసమగ్రులే వారు జేసిన పనులే దెల్పుచున్నవి.

సీ. అలనాడు జూదంబునందోడి నిలువగా బలవంతులే నీదు పతులు కాంత । కులసతివలువలు వలువంగజూడగా బలవంతులేనీదు పతులుకాంత । అడవికేగుమటన్న నడలుచునేగగా బలవంతులేనీదు పతులుకాంత । కఠినరాలనుద్రొక్కి యటునిటుదిరుగగా బలవంతులేనీదు పతులు కాంత । నారచీరెలుధరియించి పారెరకట । కూరగాయలు నములుచు కొండగుహల । వులులుగలశిమెలంగు దుర్బలులనింత । వింతవారల నికనెందుగాంతునటవే॥

అనిన ద్రౌపది సైంధవుంజూచి వరే నీతివిహీనా! జగంబుల కుపద్రవంబు గలిగించు నివాతకవచులను దానవుల గీర్వాణ విభుండో ర్వాజాలక పార్థునింబ్రార్థించిన నమ్మహాత్ముండు మాతలిప్రయుక్తంబైన దివ్యరథంబెక్కి నెక్కండు దేవలోకంబున కరిగిన మహేంద్రుడునర్ధాసనంబెక్కి నివాతకవచాడి దుష్టునవధియించి దేవదత్తకిరీటంబులు బహుమానంబులు వడశెనుమేశుమెప్పించియు గాంతకాలప్రయుక్తంబగు పాశుపతంబుగొనిడొ. నట్టిమహావీరుండగు యర్జనునితో జరాసంధబకహిడింబకిమ్మీర జటాసురాధుల నస్త్రశస్త్రంబులులేక మల్లయుద్ధంబున జయించి కుబేరునివాసంబునకరిగి యక్షరాక్షసులనోడించి సౌగంధిక కుసుమంబులు గొనివచ్చిన సిహ్వాబలుండగు భీమసేనునితో॥

దర్వు- ఏకతాళం.

పగబెట్టుకుంటివిక బ్రతుకాగలవా॥ పగ॥

మగువాలగోరూట తగదూతులువా జగమూలుగాల్చేడి చండా తేజులతో॥ పగ॥

పాండావావీరుల దండీశరంబూల భండానమునసీదు కండాలు రాలంగ॥ పగ॥



మదగజబృందముల గదచేజడిరుగొట్టి పృధివీపాలునేయూ భీమూనితోడాను॥ పగ॥

హెచ్చుశరంబూల గృచ్చిపాతిపెట్టు సచ్చారిత్రుడు భీభత్సూనితో లేని॥ పగ॥

యతను తమ్ములూరి జలజాక్షుమనమూన దలచూవారలాని తెలశి తెలశియుట్లు॥ పగ॥

సైంధవుండు భామినీ నిద్రాహారంబులు వర్జించి నడపుల నిమములుగుడుచుచున్న వాడేయని పుత్రవాత్సల్యంబున సుత్రాముండు నిర్జరపురి కర్జునను బిలుపించినవాడదియు నొకపరాక్రమంబె వానేల భూషించెదవు.

ఉ. సారసనేత్రిరోవినుము శౌర్యబలంబులు గల్గువాడనా
పేరువినంగభూపతులు భీతిలుచుండుదురట్టినర్షదిక్
కోరకద్రోచిపుచ్చెదవు కోరికయుండినసంభవించునే
దారయమత్సమానుడొక డన్యుడులేడికరమ్ము ప్రీతితోన్॥

అనిన ద్రౌపది వరేదుర్మార్గ నేనొక్కదాని నిక్కడచిక్కితినని పెక్కులుప్రేలకు నక్కమలనాభుండు మిక్కుటమగుతేరెక్కి పాంచజన్య రవంబుతో నిన్ను నెక్కడికేగినను చెక్కలు చెక్కలుగా దునుము నిక్కడనుండక ఛీపొమ్ము.

సైంధవుండు, ద్రౌపది.

క. ఎర్రగుద్దుమునూ మాగధునకు
వెరచి సముద్రంబునందు ఖీరగుణంబుల్
మరచియొదిగి యుండెడునా
హరిబల శౌర్యములువారు నహాహావింతల్॥

వ. చిన్ననాడు ఘోషకన్యకల వలువలం వెన్నముద్దలు దొంగిలించె నతనివద్ద స్త్రీలచెరిత్రంబు లనేకంబులుగలవు గాన నతనిని చెలువయనవచ్చునే.

ద్రౌపది.

వరే సైంధవ సకలలోకరక్షకుండగు పుండరీకాక్షు నెరుంగక నాక్షేపించి పలికెదవు నమ్మహాత్ముండుగాడు నీవేయూడుదానవు.

దర్వు- శంకర. ఆది.

తగదుర ఛీపో సైంధవా తగదు తగదుర ఛీపో సైంధవా మగవాడవెనీవు మగువవుగాకనా మగలులేనితరి మగువలచేరరా॥ త॥
ధీరులు పాండవధీరులులేరని చోరుడవై వనీ దూరితివిర ఛీ॥ తగ॥

ధరణిజగొంపోయి దురమునరాముని శరమునబడెదశ శిరుడ రివినవా॥ తగ॥

రాఘవరావును రక్షణజేసిన యాఘనుడగు హరికనుజనెరుగవే॥ తగదురా ఛీపో సైంధవా॥

మాటలు.

పాపి నీవురావణునిరీతి సైన్యసమేతంబుగా చెడనున్నావు.
అనిన సైంధవుండు ద్రౌపది.

గీ. రామునంతటివారె నీరమణులతివ
గెరలిమాగోటికాస్యుడే గెలువగలడు
వారిగొనియాడ నినుగావలేరువట్టి
యాసలేటికి నాసొమ్మువై తివీవు.
అనిన ద్రౌపది.

మాటలు.

వరే తులువ పలుకనేరవు కలువలరేని కులంబు వెలుంగజేయు పాండవుల బలంబులెరుంగ నీకలవియే నామాటలిపుడు నీచెవినాటున.

దర్వు- శంకర. ఆ.

అప్పుడెరుగగనగును సైంధవ అప్పుడెరుగగనగును నిప్పులురాల్గ దక్రిప్పుచు భీముడు గొప్పకేకవ్రేసి కుప్పలింపగా॥ న॥
వినుతయశుడుయమ తనయుడనుజులతో ననినినునాపో శనము గొనగబూను॥ న॥



మండునగ్నిగతి గాండీవముచే నుండగవెలుగా ఖండలసుతు గను॥ న॥

ధరనుతమ్ములూరి హరినెంచుచుకవ లరిమురిగా శరవరషము గురుపగ॥ న॥

సైంధవుండు ద్రౌపదియేల బెదరించెదు.

క. నీకాంతు లొక్కరేకా
దేకంబై జగములెల్ల నెత్తివచ్చినన్
బోకార్తుగాని విడువను
వ్యాకులతన్ జెందియెందు నరిగెదతరుణీ.

వ. యీాసంవాదంబువలననే వృథాకాలంబు జరుగుచున్నది. వేవేగ నరుగుదమురమ్ము మానినీ అని సైంధవుండు సమీాపించుచుండ.

ద్రౌపది మనంబున అయ్యయో! యిద్దురాత్ముండు నావద్దకు నిర్దయుండై తద్దయుజనుదెంచుచున్నవాడు నింకనేమిశేయుదాన నని కోపభయంబులు మనంబున బెనంగొన నుత్తరీయంబు చక్కనొత్తుచు॥

దర్వు - శంక. ఏక.

ఓరే దురాత్మా ఛీపోర ఓరీదురాత్మా మేరమీరికోరిపైకి దూరిదూరివచ్చెదేరా॥ ఓరి॥
కలకలనుచు బలుకునీదు బలమునేలపాలుగాను॥ ఓరి॥
కాలపక్వమయ్యె నిక్లేల తూలిపల్కెదావు॥ ఓరి॥
పాండుసుతుల బాణమూల పాలుగానున్నావు॥ ఓరి॥
వావివరుసలేని దుస్స్వభావ చావుగలుగుపోర॥ ఓరి॥
తమ్ములూరిధాముమదిని నమ్మిచెడక బ్రతుకుపోర॥ ఓరి॥

సంధి॥ అనిద్రౌపది యీాకుటిలుండుపైకి గవయబోవుచున్నవాడెంతకయినను సాహసుండె అక్కట. నింకనేమిసేయుదాన అల్ల వృక్షంబుక్రింద యోగసమాధినున్న ధౌమ్యమునీంద్రుడు చెంతకయిన జేరు

దాసి నని జనుచుండ సైంధవుం డడ్డంబుగా నిలచి తరుణీ యెందు బోయెదవు॥

దర్వు - హిందుస్తాని ఏక సంవాదం

వలవనిపలుకులు బలికినదీరదు కలికిరో యిటురమ్మ॥
మాటలు॥ ద్రౌ॥ వరే అడ్డంబురాకు॥

దర్వు॥ తులువాననిన్నిటులనకుము నేనీకలవిగాను రాపోమ్మ॥

మా॥ తరుణీ నిన్ను బలాత్కారంబుగా నెత్తుకొని అల్లకాంచన రథంబునగాని నాభద్రగజంబుపైగాని నిడుకొని మాపురంబున కరిగెద.

ద॥ యోచింపక నిన్నెత్తుకనేగెదనో చపలాక్షిరొచూడు.

సంధిమాట॥ అని హస్తంబుపట్టిన ద్రౌపది ఓరిమదాంధా నా హస్తంబువిడువు విడవరాపాపిష్టా ! ఛీఛీనన్నంటకురా పాపి నీచా చెడుదువ్వురా నేడు అనిహస్తంబుతో గొట్టిన పడి ద్రౌపదీ యెంతబలశాలివే భూమిపైబడునట్లుకొట్టితివి కానిమ్మ అని వెంటనేలేచి కోమలాంగీ॥

గీ. ఇంతమాత్రంబునకె నిన్ను విడతునటవె
వీడుసైంధవుడరిబల విక్రముండు
యెరుగవేనింకగొంపోదు నెవ్వరడ్డ
పడినవదలను నాదగు బలముజూడు.

అని బలాత్కారంబుగా నెత్తుకొనిన.

ద్రౌపది మాటలు.

ఓరి కులద్రోహి యెంతపాపంబునకు పాలుపడితివి నన్ను దిగవిడువుము. సైంధవుండు ద్రౌపదీ యింక బలుకబోకుము.

వరేగోటికాస్యా రాజా కార్యసిద్ధియయ్యనే వశే పాండవాంగ



నను యెత్తుకవచ్చుచున్నవాడ కలయరమ్మ రాజా యిదేవృక్షంబు క్రిందనుండి వచ్చుచున్నవాడ.

అంత ద్రౌపది దుఃఖించుచు.

అయ్యయో ! వీరిద్దరుబారి నెవ్విధంబున దప్పించుకొనియెద ధాత్రిక పుష్పంబులకొరకు వనంబునకరిగి యింకనురాదాయె ధౌమ్యమునీంద్రునయినను బిలుచుకొనియెదనని.

దర్వు- హిందూ- రూప-

శరణు ధౌమ్యమునివరేణ్యా కరుణజూడవే పరులపాలయి పోవుదాన నరశికావవే॥ శర॥

పాపి సైంధవుండు నన్నుబట్టిగొంపోయె ఓపిమీరా లడ్డగించి కాపాడారారే॥ శర॥

రమణచింతలపూడి రాఘవరావు నేలినా భువిని తమ్మలూరిశౌరి బ్రోవడాయనో॥ శర॥

మాటలు॥ హాదైవమా ! ధౌమ్యమునీంద్రుండు నిందుయోగ సమాధినుండె గాబోలు కాదేని పలుకడే అనిగొప్పగా, ధౌమ్య మునీంద్రా రక్షింపు రక్షింపు.

ధౌమ్యుండాలించి హా ! యిది పాండవాంగన నెలుంగుగా నున్నదే హా ! ద్రౌపది యేమి ద్రౌపది తనమనంబున యిమ్మహాత్ముండు యింతకుముందు నామొరాలించియుండడు గాబోలు నాస్థితి యెరింగినేని యేమియని యేలనుడువును గాన మరల నాస్థితి దెల్పెద ధౌమ్యమునీంద్రా !

ఉ. పాపముకోర్చి సైంధవుడు పయ్యెదబట్టియుకూలద్రోచిసం
తాపము నొందునన్నబలిమితాగొని పోవుచునున్న వాడహాహా
నాపతులింటలేనితరి నన్నిటు జేశె దురాత్ముడింకనో
తాపసవర్యశిష్య సతితాపముమాన్పను వేగరాగదే.

ధౌమ్యుండు॥ అయ్యయ్యో ? దురాత్ముండింతపనికి వెతకెనా ద్రౌపదీ భయపడకుము వచ్చుచున్నవాడ వరే సైంధవా మదాంధా పోకు పోకు ధాత్రికయు గానరాదెందుబోయెనో.

ఓధాత్రికా నాయనా పుష్పంబులుగొని వనంబుననుండిదేవచ్చుచున్నదానను. ధాత్రికా నీపుష్పంబులు పృథివిపాలగు పాండవులాశ్రమంబునలేనితరి మదాంధుండగు సైంధవుండదయుండయి ద్రౌపదిని గొంపోవుచున్నవాడు నీవీకృష్ణాజనపూజాపాత్రాదిపరికరంబులు గనిపెట్టుకొని యాశ్రమంబుననేయుండు ఆకులద్రోహుండు పాంచాల నందనయెడ నేమిదోసంబు వెతకునో నేను వేగంబవెంటనరిగెద. అడవులనుండి వారుయిపుడే నరుగుదెంతురు వారల కీవృత్తాంతం జెరిగింపుమనిన.

ధాత్రిక॥ అయ్యోతండ్రీ మనపాండవాంగన కెంతయాపద సంభవించేహా ! ధౌమ్యుండు ధాత్రికా వగవకు పరమపతివ్రతయగు నాసుదతికొక్క దురితంబుం బొరయదు వారలు బహుదూరం బరగియుందురు నేనరగుచున్నవాడ.

సంధి॥ అని ధౌమ్యుండతిత్వరితగమనంబున సైంధవుం జేరవచ్చుచుండ నచ్చట ద్రౌపది సైంధవుబాహువులలోయుండి దుఃఖితయగుచు అయ్యో ! ధౌమ్యమునీంద్రుండు కలయరాడాయె !

సీ. బాణాస్త్రసంపూర్ణ తూణీరధరులార నాకడ్డపడరారెనాథులార ।
భండనోద్దండమార్తాండ విగ్రహులార నాకడ్డపడరారెనాథులార ।
శరణాగతత్రాణ శౌర్యసత్వములార నాకడ్డపడరారెనాథులార ।
ఖండితశత్రుకోదండపండితులార నాకడ్డపడరారెనాథులార । వినుతబలులార పాండవతనయులార । ధర్మపరులారనాపదోద్ధారులార ధీరమతులార సదమలాచారులార । రారెదయజూచిగావరే ఘను ణులారా॥

అనుచుండ ద్రౌపది యింక దుఃఖింపకు ధౌమ్యుండనిదే కలయ వచ్చుచున్నవాడనని సైంధవుంజూచి.



ఉ. ఓరిదయావిహీనయిటులొప్పునె సాధ్వీసుశీలధర్మసం
చారిణియాజ్ఞసేసినవిచారత దోట్కొనిపోయెదా
శూరులుపాండుపుత్రులతి ఘోరశరంబుల నిన్నుగూల్తురీ
వారిజనేత్రినివ్వడలు వావినెరుంగుకుశాత్మ సైంధవా.

వ॥ ఓరికులపాంసనా నన్ను కలయరానిమ్ము చెడిపోకు యింకొ నామాటలువిని యాపాటలాధరిని వదలు.

అనుచుండ సైంధవుండేమియుం బలుకక ద్రౌపది నెత్తుకొనుచు సత్వరంబుగా జని రథంబుపయిం గూర్చుండబెట్టుకొని గోటికాస్యా నేనుముందు జనుచుండెద నీవాబలంబులం గలుపుకొని దండనాథ సమేతంబుగా నావెంటజనుదేవమ్మా అని సైంధవుండాజ్ఞాపించి ద్రౌపది ప్రలాపించుచుండ నడిసరకుసేయక యరదంబు దోలుకొనిపోవుచుండె ధౌమ్యుండు వెంటనంటివచ్చి తుచ్ఛా యిచ్ఛపలాక్షి నెచ్చటికి గొంపోయెదువింక.

దర్బు- శంక. ఆది॰

విడువిడు విడువుము సైంధవా యింక విడువిడువిడువుము సైంధవా చెడు కాలమురా ఛీ యీపాండవపడతినిబట్టియు బ్రతుకగలావే పరమపతివ్రత పరిభవఘోరా దురితమునిన్నూ చురణముజేసుర॥ వి॥
సైంధవపాంచాల నందనగోరుట అరదనిఫలమూలకాశించుటఛీ॥ వి॥
ధరచింతలపూడి వరరాఘవరావు నరశిరోభూషణసీతావరుడిదితగదను॥
విడువిడు విడువుము॥

సైంధవుండు ధౌమ్యమునీంద్రా.

ఉ. ఏటికివేదపారగుడ వీవువృథాశ్రమజెందెదింకని
చ్చోటికి నాప్తులయ్యమరపుంగవులడ్డమువచ్చి లాగినం
గీటడగింతు నాజిననుగెల్తురె కోవిదధీరునైన నా
బోటినృపాలుతోడపగబూనుట వైదికఛాందసంబొకో.

వ. కాదేని అరణ్యంబుననుండి తపంబుశేయు పోరుండవు నీవు

మాబోటి రాజులవెంటవచ్చెదవా, నింక నైనను గ్రహించుకో నీకిమ్ముగుచోట భగవద్ధ్యానంబు జేయుచునుండు పొమ్ము॥ అనిన॥ ధౌమ్యమునీంద్రుండు. వరే నావైదికఛాందసంబు నీరాజమదాంధత్వంబు పాండవులు నిశితశరంబులు పుంఖానుపుంఖంబులుగా నీపై ప్రయోగించునప్పుడెరిగెదవు నిదియునుం గాక నీవు రాజవా.

గీ. పరగ పూర్వులచరితంబు పాడుజేసి
రాజధర్మంబు లెల్లను రాలగలపి
యితర కాంతలగోరెడు హీనమతివి
రాజవే నీవహోయెలుక రాజవగుదూ.

వ. వరే యింక నామాటవిని యీ పాంచాలరాజనందనను వదలి పాండవదృగ్గోచరుండవుగాకుండ ప్రాణంబులు గాపాడుకొనుము అనిన సైంధవుండేమియుం బలుకక జనుచుండ. ద్రౌపది సైంధవుం జూచి.

క. చపలమతి పరమధార్మికు
జపపరు నిందింపనగున ఛాఛీతగునా
కృపణుడ వినాశకాలే
విపరీతపు బుద్ధియనుట వినవా చెడవా.

అని ధౌమ్యునితో నెలుగెత్తి.

క. జనకా మీ రాయాసం
బును బొందక మందగమనముగ జనుదెండీ
తని బొరిగొన కుంతీ
తనయులు రాగలరు నెందు దాగవిడతురే.

అని ద్రౌపది బలుకుచుండ సైంధవుండు సత్వరంబుగా రథంబు దోలుకొని పోవుచుండె.

వ. అంత బలంబులుగలియవచ్చిన ధౌమ్యుండు తొలంగి బలంబులకు వెనకై యాక్రోశవచనంబెల వధియించి మొదల తమరు నియ



మించుకొనిన సంకేతస్థలంబునకు ముందుగా ధర్మజుండు సనుదెంచి. సారథితో మార్తాండుండు గగన మధ్యంబున వెలుంగుచున్నవాడు యింత కాలంబైనను అనుజులు రారైరి, యంత దూరంబరిగియుందురో యని యనుచుండ వారలు జనుదెంచి ధర్మనందనా వందనంబులు జయంబు గలుగు సోదరులారా అన్నయ్యా మేమందర మాయాదిశల కరిగి మాకంటికగపడిన దుష్ట మృగంబులనన్నిటిని నష్టంబుగావించి వచ్చితిమి. అయితే సంతోషము బ్రాహ్మణోపద్రవంబుదొలంగించితిరి. తత్ప్రియుక్తాశీర్వాద పాత్రులమైతిమి మంచిదియె. కాని తమ్ములారా దాహంబగుచున్నది. దుశ్శకునంబులు గానుపించుచున్నవి గంటిరా.

దరువు.

ఇదేమోకదా నేడూ విపరీతామూహాహా అదెపక్షిబృందంబు చదలావా పోయెనీ॥ దే॥ వరుడూ, మనడాపల నరచేదిశలందూవావిరి గ్రమ్మె కాలాహివల్మీకామెక్కె॥ ఇ॥ మనమూకలకబారె తనువూ పరవశమాయే మనపై తమ్ములూరి వనజాక్షుకృప లేదిదే॥

ఈతోచు నుత్పాతంబులు చూడగా.

ఉ. సోదరులార యీగతిని సూచకమేదొ పరాభవంబునా
పాదిలనున్నదక్కట సుభావ పవిత్రచరిత్ర ధర్మసం
పాదిని కృష్ణకేమిగనపాయము గల్గునొనొంటినుండు వే
పోదము కాలయాపనముపొందదు యింకిటులెందు ప్రీతితోన్.

వ. క్రూరమతులు ధార్తరాష్ట్రులు మనకపకారంబుశేయ కాచుకొని తిరుగుచుందురు ఆశ్రమంబున నొంటినున్న ద్రౌపదికేమి యుపాధిగలుగునో నామనంబు వికలంబగుచున్నది హా! యిదేమికారణమో తెలియదాయెననిన వారలు ధర్మజుంజూచి.

అన్నా,

చ. పుడమియుసర్వభోగములు బోవగజూదమునాడు వేళలన్
పడతిని నాదురాత్మకులు పయ్యెదబట్టియులాగు వేళలన్

వడలుచు ఘోర కాననములకు సందరమ్ముజను దెంచు వేళలన్
బెడదుమునో దృఢంబిపుడు చెడ్డదదే మొయెరుంగ నగ్రజా.

వ. అనిన ధర్మజుండు తమ్ములారా ఆయాపదలు మనకొదవి నపుడు ద్రుపదనందన మనకడ మెలంగుచుండెను. ఇంత కాలంబెన్నడు ద్రుపదనందన నొంటినుంచి కాననంబున దిరిగినవారముగాము. కావున నిదియాలస్యంబు శేయు సమయంబుగాదరదంబులెక్కుడు వేవేగబోవ లయుననిన అన్నా ధర్మజా చిత్తమాలాగే వెళ్ళుదము లెండని వార లందరు రథంబులెక్కి కొంతదూరంబరగిరంత. ఆశ్రమవనంబు దవ్వు లంగాంచి ధర్మజుండు తమ్ములతో తమ్ములారా ఏమీకాలగతి నానే త్రంబులకంతయు విపరీతంబులుగా దోచుచున్నవే.

సీ. కనుగొనశశిలేని గగనంబుమాట్కి సత్పుత్ర సంతతిలేని పురుషుపోల్కి। కమలంబులుండని కమలాకమురీతి పతిహీనమైనయయ్యతివపోల్కి । వాసరమణిలేని వాసరచందంబు నరవరుండునులేని పురము భాతి । వనప్రియలేనట్టి ఘనకృత్రిమక్రియ దీపంబులేని మందిరము కరణి । జూడకామ్యకవనమంతి శూన్యమయిన । యటులగాజూడ్కి కగుపడేనేమిగతియు । సంభవించునోనికను పాంచాలతనయ । కక్కటాకీడుగలుగునో యనుజులారా॥

వ. జరుగుకారణంబులు జరుగకమానవు. ఆశ్రమంబు సమీపించితిమి. మనరథంబుల ధ్వనివినియయినను ధౌమ్యద్రౌపది ధాత్రికలయందొక్కరైనను వెలుపలకురారయిరి. ఆలింపుడు తమ్ములారా ! హా అద్దేమి పర్ణకుటీరంబులో దుఃఖార్ణవంబు వినెంచుచున్నదే రథంబులు నిలుపుడు.

(ధాత్రికాపర్ణ కుటీరంబునందు)

దర్వు - హిందూస్తాని రూపకం.

దిక్కు లేనిదానవైతి నక్కటకటా రక్షరించేవారలెవ్వారిక్కడింకిటా॥ ధర్మజుండు ఏమీ ధాత్రికానాదంబుగానున్నదే ఇంకను కొంత



దూరంబరిగి ఆలింతము పదండు అనుచునరిగి యింక నిలుండు ఆలింతము.

ధాత్రిక దర్వు.

ద్రౌపదీని గొంపోయెడు ధైర్యమొదవెహా పాపిసైంధవుండు యెంతపనికిపూనెహా ॥

వ. తమ్ములారా రథంబులు దిగుండు నేననినరీతి యేమనపాంచాలనందనకు నేదోనొకయపాయంబు గలిగినట్లు ధాత్రిక రోదనంబు దెలుపుచున్నది అన తమ్ములంగలసి ధర్మజుండు పర్ణకుటీరంబు ప్రవేశించి ధాత్రికంజూచి ధాత్రికా ॥

గీ. హంసిరీతి నేలపై జాలిజెంది
పొరలిపొరలియు నేడ్చెదుపూనినీవు
బాధ జెందినహా యెంత బలువుగాని
భంగపరతును దెలియంగ బలుకుమబలా.

ధాత్రికా లెమ్ము.

ఇంక చింతింపకు ధౌమ్యద్రౌపదులెందుజనిన వారలు నీవిట్లు దుఃఖించుటకు కారణంబేదో దెలియబలుకుము.

ధాత్రిక॥ యిందుకులోత్తములారా వందనంబులు.

దర్వు - హిం- త్రో- ఆది.

ధర్మనందన యేమిదెల్పుదు దైవకృపలేదాయెనూ దుర్మదాంధుడు సైంధవుడు దుష్కర్మమునకును జొచ్చెను.

మాటలు॥ సైంధవుండేమి దుష్కర్మమునకు దలంచెదెల్పుము ధాత్రికా !

దర్వు॥ మగువనొంటిగనుంచి మీరలు మృగవధంబునకేగగా పగతుడాశ్రమభూమిజొచ్చియు భామినినితాగోరెగా॥

ధర్మనందనా !

వ. ఏమీ వాడునోడక మత్పడతినిగోరెనా అందులకు పాంచా చాలియేమనియె॥

దరు॥ నన్నునిట్టులబల్క-నింకేమున్నదన్నరో యంచునూ యె న్నివిధముల వేడనోడక యెత్తుకొనిగొంపోయెను.

వ॥ అయ్యోయో ఆచపలుండెంతపనికిబూనె చెడుకాలంబు గా బోలు అయితే ధాత్రికా ధౌమ్యమునీంద్రులేరి ?

దరు॥ ధారుణీవరతమ్మరి విహారుమదిని దలంచుచూ నారిరత్న ము వెంటా ధౌమ్యాచారుడరిగెను దూరుచూ॥

వ. అని ధాత్రికబల్క భీముండుకోపంబుతో

శా. ఏమీధాత్రికమృచ్ఛిలించి పగతుండేణాక్షిగొంపోయెనా
భీముండుండుకురుంగడేమదిని నాభీభత్సునిందల్పడే
భూమీశాగ్రణికెగ్గుజేశి బ్రతుకంబోలంగలేరెవ్వరుౕ
కామాంధత్వము కండ్లగప్పెనిపుడే గ్రక్కింతునమ్మూర్ఖునిౕ॥
అనినధర్మజుండు తమ్ములంజూచి.

తమ్ములారా సర్వసంపదలు దుర్యోధనునకప్పగించి దీనులమై కాననంబున కరుదెంచినను కష్టంబులు కడముట్టవాయెను గదా మృగ వరంబులువిని భీతిల్లునట్టి.

దరు- హిం- ఆది.

మనసతికెంతా వసటగల్గెనుహా మనమునసన్నేమని దూరునె హా తాళిగట్టినతదారపి కానలపాలయి తుదకీపాటువాటిల్లె॥ మన॥

అడవులలోపల నిడుములకోర్వలే కడలుచునుండా జడుడు గొంపోయె॥ మన॥

ధరనుతమ్ములూరీ హరిప్రియసోదరీ పరులచెనెంతా పరిభవ మందెనో॥ మన॥

ఇదియునుంగాక.



ఉ. శత్రుమదాపహారులతి శౌర్యధనార్జితులేపురింకనా
పుత్రికినాథులయ్యిరి సురభోగములందునటంచునుండు స
త్పాత్రుడుసోమకుండు నతిధర్మచరిత్రయునాటనుండియుౕ
గోత్రమ్రుగాదులంగలశి కుందుచుగోల్ప డెసింధునాథుచేౕ॥

అర్జనుండు॥ అన్నాధర్మజా వగవకు యింతమాత్రంబునకే చింతిలవలెనా ?

ఉ. పంకజనేత్రి పుణ్యసతి పావనిసాధ్వినుసీలద్రౌపదిౕ
గొంకకసైంధవుండుగని గొంపొవనేర్చెనె నేర్చుగాకవా
డింకను నబ్ధిజొచ్చినను నింకెటుబారిన పృథ్విదూరినౕ
శంకరుడడ్డగించినను సంయమినీపురి వానిజేర్చెదౕ॥

భీముండు కోపంబుతో మీదికార్యంబున కనుజ్ఞయొసంగు ధర్మజా ?

దరు- చాపు.

చింతింపనేలను ధర్మజా నీవుచింతింపనేలనూ ధర్మజా॥

యింతీనిగొంపోవునంతకుజాలెనె యెంతవీ నీబలమెరుగాని వా డనే॥ చింతి॥

పంతగించి నొక్కింతలోమూర్ఖుని గొంతువెంటనంటి గట్టుదు రధమున॥ చిం॥

గడగడవడికి మీయడుగూల్లపైబడ్డ విడువాకగదచేత పుడమి పాల్గావింతు॥ చిం॥

ధరనుతమ్ములూరీ శ్రీహరిమదిమెచ్చగ సరసిజముఖినిందు సర గునదెచ్చెద॥ చిం॥

వ. అని భీముండు బలుక నకుల సహదేవులు అన్నా యింక నాలస్యంబేల.

గీ. అరయ భస్మంబులోని పూర్ణాహుతి యును
శునకచర్మపు తిత్తిలో సుదయుమలిన

పంకగతియగు పుష్పంబుపగిది కాంత
దూషితయు గాక మున్నె దోడితెత్తు.

వ. ఆ పాపాత్ముండుఁ సహోదరి అంటగూడని సతియని యనక యొంటరిగా నుండు కాంతనంటి యెత్తుకొని పోయెగదా. యిట్టివాడెంత కైనను సాహసుండగు గావున వేవేగ నేగుదములెండు అనిన సోదరులం జూచి ధర్మతనయుండు మీరనినరీతి వాడెంతకైనను జాలినవాడెయగు నైననూ.

మ. వరఋత్విగ్జన మంత్ర వాక్యయములన్ వర్ధిల్లిపెంపొందునా
పురుడాశంబును గుక్కకర్హమగునా బోవచ్చునా వాడికన్
యరదంబుల్ వెసనెక్కుడత్తులువకన్యన్ బాధగావించునే
డరుగంగావలెలెండు కాలగతినాహా దప్పదెవ్వారికిన్.

వ. తమ్ములారా మీమీ వర్మకృపాణబాణాసన శస్త్రాస్త్రంబులు గొనిలెండు ధాత్రిక మేమాదురాచారుని బోరిగొని సరశిజాననను గొనివచ్చెద మంతకు నీవిచ్చటనేయుండు మని పాండవులు రథంబులెక్కి సన్నద్ధులై సింహ నాదంబులు సేయుచు సైంధవబలంబుల గలయం బోవుచుండ నట ధౌమ్యుండు సైంధవునకు వెనుకనై బోవుచు వరే బలవద్విరోధంబు శుభంబుగలుగదు. అదె శింధువైరి పరాక్రములగు పాండవుల స్యందనంబులు గానవచ్చుచున్నవి.

దర్వు - శం - ఆది.

పాపి సైంధవా పాంచాలి వదలవా కోపంబున పాండవులిక యీపగిదిన నిను విడువరు॥ పాపి॥

బ్రతుకగలవా ముందు గతియుగానవా అతి వీరుడుపార్థుడు సుని శితశరముల బడనేయుర॥ పాపి॥

వ. అనుచు వెంట జనుచుండ పాండవులు అన్నా ధర్మనందనా బలంబులు వేగిరంబుగా ముందు నరుగుచున్నవి. ధౌమ్య మునీంద్రుండు వెనుక నరుగుచున్నవాడు గంటిరే తమ్ములారా అమ్మహాత్మునికి యెంత



ఆయాసంబు గలిగియుండునో గదా। దురాత్ముండగు సైంధవుండందర మనంబులు కుందజేసె. హా తత్ఫలం బిప్పుడే యనుభవించగలండు అని పలుకుచు ధర్మజాదులు ధౌమ్యమునీంద్రు సమీపించి రథంబులు డిగి ధౌమ్యమునీంద్రా నిలువుండు,

క. వందనము మౌనివర్యా
సైంధవు బోరిగొనెదమింక శాంతి పడుడుమా
సుందరి దెచ్చెడు నంతకు
నిందుండుం డాశ్రమమునఁ కేలుదమవలన్॥

తాపసేంద్రా మాకొరకై తపంబు వదలి యీపగిది మీపాదంబులు నొవ్వ బహు దూరంబరుగు దెంచితిరిగదా, యాకంటకుండు మాకంట్రి కగుపడె నింక నెందుజనువాడు మీ మనంబున కాయాసంబు దోచి నప్పుడే వానికి కష్టదశలు సంభవించె నింకవీత ఖేదురై యుండుడు.

ధౌమ్య॥ పాండవులారా ?

గీ. భామగొంచునేగె పాపిసైంధవుడదె
బలముముందు నధమ బలుడువాని
గూడముట్టిబాణకోటిచే ననిలోన
గర్వమణచివేగ క్రాంతదెండూ.

ధర్మరాజు॥ మహాత్మా ! మీరుపథాయాసంబు దీర్చుకొనుచు నిచ్చటనేయుండుడు పోయివచ్చెదము.

జయంబుగలుగుగాక పోయిరండు.

అంతధర్మజుండు తమ్ములతో రథంబులెక్కి సైంధవబలంబుల గదియబోవుచుండ సింధువిభుండు పాండవుల దవ్వులంగాంచి ద్రౌపదింజూచి.

క. ఓవారిజాక్షి వినువీ
రేవురునీపతులెవీర లెవ్వాండెవ్వాం

డేవిధమువారో తెలియం
గావలయు నెరుంగ బల్కు గలుగు తెరంగుల్॥

అనిన ద్రౌపది ఓరిదుర్మార్గా నీతో భాషించిన మహాపాతకం
బు సంప్రాప్తంబగునయినను పరమపుణ్యులగు మత్పురుషుల చరిత్రం
బడిగితివి గాన దెల్పెద వారల నెరుగవలెనంటివి.

చ. ఎరిగియు నేమి శేయుదిక నెవ్వరుదిక్కు దలంచు భావమం
దెరుగక పాండవేయులకు నెగ్గొనరించితి చేటుమూడె భీ
కరులగు తమ్ములం గలసి కానగ వచ్చెను ధర్మజుండిదే
వెరపునడంగ నాకు నరివీరుల చేబడిదోరి దుర్మతీ॥

దర్వు - చాపు.

వరే యింకేమి జేశేను పాండవులదెనీ బింకాల్ మానుము సైంధ
వా శంకింపాకాను నిటు జేరవచ్చిరి నివంక జూచు భూవరు డెధర్మజు॥ డిం॥

క. శరణన్న నెట్టి శత్రుని
కరుణను రక్షించు నింక గర్వము డిగియా
పురుషుని పదముల పైబడు
మరచును నీతప్పు నేగు మాసింధుపతీ॥

వ. అతండు క్షత్రియకులంబున బుట్టి పరాక్రమంబు వదలి శత్రు
లకు విధేయుండై మునివృత్తి నున్న ధర్మనందనుని శౌర్యధైర్య గాం
భీర్యుండగు నేను శరణని పదంబులు బట్టుకొనియెదనే ఆతలంపులుడుగు
మతండు ధర్మనందనుండంటివి తక్కినవారలెవ్వరెరింగింపు.

ద్రౌ॥ దర్వు॥ సాలభూరుహాముబోలి రథంబునగ్రాలెడు వీరుడు
భీమసేనుండదె॥

గీ. బకహిడింబకిమ్మీరుల బాహుబలము
నాజరాసంధు శౌర్యంబు నవనిపాలు
గానొనర్చియు భువినిండు ఘనతగాంచు
నట్టి భీముతో బోరలేరెట్టివారు॥



సైం॥ వ. యితండేనా తిండిబోతు పెనుకువ యుద్ధంబు దప్ప శస్త్రా
స్త్రంబుల తెరంగేమియు నెరుంగడు నేననేక దివ్యశరంబు లెరింగినవా
డ నితనిని నారథంబు పొంతకు గానిత్తునే యింక యాన్యరథాభమలుడి
గి తక్కినవారల నెరింగింపు.

ద్రౌ॥ దర్వు॥ తాళప్రమాణపు ధనువుచేబూనియు శూలియ
నాగా రణశూరుడర్జునుం॥ డిం కె॥

గీ. ఇమ్మహాత్ముని బోలువాడెందు లేడు
బాహుబలవిక్రమంబుల ప్రబలుడితడు
కామరోషాదిగుణములు కాలవశత
గలిగినను ధర్మమించుకగడువడితడు॥

వ. ఆహా ? ద్రౌపది యితని పరాక్రమంబు సందియంబె యట్ల
నిన బలశాలియగు నేని కలకాల మీయడవులలో నిలచియుండడు ధను
ర్విద్య యభ్యసించునంతమాత్రమే కాని ధైర్యహీనుండు నితండు నాతో
బోరజాలడు గాన నీవట్టియాశలు కట్టిపెట్టి కడమ యిరువురను నె
రిగింపుము.

ద్రౌ-దర్వు-కరమూన గుణమును సరుచుచు నతికోప పరత
వెల్గు నతడు నకులుండు.

క. నీతియుతు డిద్ధతేజుడ
రాతి బలాంతకుడు ధర్మరక్షణపరుడున్
భ్రాతృపద సేవకుండును
పాతక నిను ద్రుంపగలడు భండనమందున్

వ. ఏమీ యితండన్నల నాశ్రయించుకొని వారి మరుగున బ్ర
తుకుచున్నవాడా ఇట్టివాడు నన్నెదిరించి నిలువగలడే యీకోరికలవలన
ప్రయోజనంబు లేదు. అల్ల చిన్నవాని తెరంగు తెలియబలుకు.

ద్రౌ-దర్వు- నిరుపమానసుందరుడదె బలముల నరయుచున్న ధీ
రుడా సహదేవుం డింక.

క. కుంతికి ప్రియపుత్రుడు బల
వంతుడు శిఖిచల్లనైన వసుధడాగిన ధీ
మంతుడు ధర్మము దప్పం
డెంతటి పనికైన యలకడీసుగుణుండుర్.

సైంధవుండు-వ. ఇతండా బలవంతుండు కడు బాలుండే మత్తైన్యంబులగని దీనుండై వెరగుజెందిన చందం బీతని మొగంబే చెప్పుచున్నది. గాన యీ కానిపోకల బోకు నీపతులందగు బలహీనులే.

క. యీతడు జూడగ బాలుం
డాతండసమర్థుడాతడనిలో భీతుం
డాతండు తిండిపోత
ల్లాతడు పారుండు వీరలందరు ఘనులే.

వ. అనిన ద్రౌపది ఓరీ మదాంధాత్తైలంబై పోవు సమయంబున దీపంబు ప్రజ్వరిల్లి చల్లారురీతి నీకు నాయుష్యంబు పరిపూర్ణంబై కాబోలు ఘనబలులగు మత్పతులహీనులంగా నెంచుచున్నాడవు తొందర పడకు.

దరువు.

జడామతీ సింధూపతీ కుడువగడాగి కూరలరుచులడిగెదేర చెడుదువురా॥ జాడామతీ॥

కలన బలియులగు వారల బలములెరుగ నగునులేరా॥ జడా॥
తుచ్ఛఘోరశరముల నిను గ్రుచ్చు నపుడు దెలియవచ్చు॥ జడా॥
తమ్ములూరి ధాముని మది నమ్ము ఘనులగెలువలేవురా॥ జడా॥

సైం-గీ. పల్లవాధరనీపతుల్ బలులటంచు
యుల్లమలరంగనిట్టులయోటలేక
ప్రల్లదంబులుబల్కిన భయముగలదే
పిల్లిశాపంబునకు నుట్లుత్రుళ్లు నటవే.



వ. నాతీపతులు నాతో పెనంగు సమయంబున నీవే మధ్యవర్తివై మాతారతమ్యంబులు గనుంగొనుచుండు నన్ను దూషింపకు.

డ్రా—ఉత్పలమాల విక్రీడితావృత్తము.

తుచ్ఛమదాంధ మీదిగతి దోచక నీతి విహీనవృత్తిమై చిచ్చొడిగట్టినట్టునను జెచ్చెర దెచ్చితి వెందుబోయెదీ వచ్చెదువారె మత్పతులు వారు పరాక్రములాజిలోననీమచ్చనడంగ చేసెదరు మానముగోల్పడె దోరి దుర్మతీ.

వ. సోదర సమేతుండైన ధర్మనందనుం బొడగంటి నింక నీవలన నాకు భయంబుదోచదేమి సేయువాడ వింక నీతో విశేషబాషణంబులు నాకేల పోపొమ్ము. అని ద్రౌపది మారు మొగంబిడి యూరకుండె నంత పాండవులు, బలంబుల సమీపించి రందు భీముండు అన్నా ధర్మరాజా ఇమ్మదగజంబుల మద్దదచే పృథివిపాలు జేయువాడ జూచుచుండు మని రథంబుడిగి గదా హస్తుండై రౌద్రాకారంబున సింహనాదంబు జేసి.

క, ఓరోరి నిల్వుడిక మిము జేరుతు సంయమినిపురికి జెచ్చెరగానిం
కీరూపుతోడ బోవం గారాదిదెనవనిపాలుగా నున్నారల్.

వ, దుర్మార్గులారా ధర్మనందనున కపకారంబు జేసి భీముని కంటికగుపడి నిలపైనిలచు వారలు గలరా. నింకెందు బోగలరు. ఇక్కాననంబున మమువిడువక మిత్రులైవర్తించు కాక గ్రుధ్ర జంబుకంబుల మనంబులానందంబు నొందుచు యథేష్టముగా భుజించునట్లు మీ మాంస రక్తంబులచే భూత సమారాధనంబు జేసెద నిలువుండు పోకు పోకు డనుచు భీముండు మదగజ సముదయంబుంగదశి కొదమ శింగంబువలె గదచే పృథివిపాలు సేయుచుండ కొందరదరి జయద్రథుం జేరి.

దర్వు—ఆది.

సింధు భూవరా పాండునందనుల్ జేరవచ్చిరి॥ సిం॥
సింధుర వైరిపరాక్రములదె రథ బృందంబుల ధర్మమందగ జేసి

రి ఘోటకంబులా గీటుచు సామజకోటి జొచ్చిరి మేటి వీరులను నూటిగ శరముల నాటుచు మీసాల్ దీటుచు నీటుగ॥ సింధు॥

వ. రాజేంద్రా వారితో దలపడి యాజ్ఞయొసంగితిరా. దండనాథులారా.

క. తొలగకను నెక్క మొగిగా
దలపడి పొడువుండు వారిదర్ప మడగ మీ
రలు యోచింపక జనుడే
గలుగంగా నెరపి కేల కదనములోనన్.

వ. రాజా తమరు శలవొసంగితిరేని మీసహాయంబు గోరకనే జయించగలము పోవుచున్న వారము అని సైంధవుచే శలవంది సన్నద్ధులై గజబృందంబులతో గోటి కాస్యుండు భీమసేనుని పదాతులతో త్రిగర్తదేశాధీశుండగు సుధన్వుండు ధర్మనందనుని ఆశ్వినేయదళ సమేతంబుగా క్షేమంకరుండు నకులుని నపారకిరాతులతో సురభుండు సహదేవుని నంగారకుండు మొదలుగా అతి వీరులగు సౌవీరకుమారులు పన్నిరుఖ్వురు మహారథులు తమ తమ బలంబుంగూడి కళింగధాత్రీతలనాథు మున్నిడుకొని నర్జునినిందలపడి మహా ఆహవంబుయందు దొడంగి రంతు ధర్మనందనుండు రౌద్రాకారుండై సుధన్వుబలంబుల పృథివిపాలు జేసి సుధన్వు సమీపించి రథంబు రథంబు గదియుదోలించి.

దర్వు - ధర్మరాజు యుద్ధము.

ఓరోరీ త్రిగర్త ధారుణీవల్లభ నీరూపుమాపెద నిలువుముర్రా వీరాన్ని తీర్థాగమీరీ పల్కెదేర ఘోరాశరంబిదె చేరీవచ్చేనురా॥ ఓరీ॥

వ. అనిన వాడు ధర్మనందనా నీశరంబు నాయురదంబు పొంత రాకుండ నరికి వైచితి.

క. ఆపదలకోర్చి సంపద
కాపుర ముండియును కూరగాయలుదినుచున్



బాపలగలశీ మెలంగెడు
నీపటు బలిమిచట సాగనేరదు బొమ్మా.

వ ఇదే మదీయబాణంబున నీధనుర్భంగంబు జేశెద నని శరంబు విడచిన ధర్మ వరే సుధన్వా మత్కోదండ విఖండనంబు జేశితివిగదా, కానిమ్ము అని వేరొక్క విల్లెత్తుకొని ధర్మనందనుండు శౌర్యతేజోమూర్తియై శరంబు సంధించి.

సంధి॥ గీ. వకటి ధనువు రెంట వాజుల మూడింట
కేతునాలుగింట సూతుసిరము
నైదిటను రథంబు నారింటపలుకయు
నేడుబాణములను నేశెనతనీ॥

ఇట్లు సుధన్వునివధియించి ధర్మనందనుండు పేరడవిదహించు దావానలుండన వెలుంగుచుండె.

నకులునియుద్ధము.

వ. నకులుండు శితశరంబుల నాశ్వినేయాలంబలుకుమూర్చి క్షేమంకరుదెస నడుచుచు నతనితో వరేభూపాలా నేనుగనెక్కి పేనేబల వంతుండనని నిక్కబోకు.

దర్వు.

క్షేమంకరా జేరారారా నీమారెననుబోరగా మానుమాను వింక॥ క్షేమంకరా॥

మదగజమెక్కిటు ముదముజెందకుము మదమణగింతున యెదుటబడితయ్యయ్యో॥ క్షేమం॥

తమ్ములూరీ రామునెమ్మాదినమ్మి రణమ్మునను౦డకా పొమ్ము బ్రతుకుదువు॥ క్షేమంకరా॥

వ. అనిన క్షేమంకరుండు నకులా వన్నెరుగవా?

గీ. నీబలం బెంతచక్కనై నిలుపునకుల
పదరబోకుమునాచేత బడుదువిపుడె
వుదయమెవ్వరిజూచితో విధికి నెంత
నెక్కుడైతివో నీవునాయెదుటబడితీ॥

వ. అనుచు నిరువదిశరంబుల నకులకేతనంబుద్రుంచిన మాత్రేయుండు రౌద్రాకారుండయి గదగొని ధరణికిలంఘించి॥

గీ. తురగములజంపిసూతుని బొలియజేయ
బెగ్గలంబుగవాడిల డిగ్గునెడల
గదశిగదచేత రుధిరంబుగ్రక్కునటుల
శిరముబెట్టిదముగ వ్రేయ ధరణిగూలె॥

వ. ఇట్లు క్షేమంకరుండు బడిన॥

అర్జునిని యుద్ధం.

సౌవీరకుమారులు దర్పంబొప్ప నప్పార్థుపై నొక్కమొగి సైన్యసమేతంబుగా జుట్టుముట్టిన నతండు గాండీవ చండకాండంబుల నబ్బలయులనందర రణస్థలికి బలిజేసి కాళింగుపయిం గవసిన నతండర్జునుంజూచి.

దర్వు- చాపు.

ధనుంజయానీవు ఘనుండవని బహుజనంబులెన్నగవినుండుదున్ గనంగనాతో బెనంగలేవని మనంబునయ్యోచనంగలిగెనో॥ ధను॥

వ. అయినను నీశక్తి సామర్థ్యం బీబాణంబు తప్పించుకొంటివేని దెలియవచ్చునని యొక్కబాణంబు తెగనిండదీశి విడచిన పార్థుండు నది నడుమనదునిమి॥

అర్జు॥ దర్వు- కళింగనీపటు బలంబెరుంగుదు నిలంగజాలవు దొలంగుమా చెలంగిముందర మెలంగదేనీ తలం గగనమండలిం నెగరుగ- కళింగ.

వ. అనిన నతండు వగేపార్థ నీవనంగనాకు పిపీలికా ప్రాయంబురా.



క. ఇదె వాయవ్యాస్త్రము నీ
మదమణచును నింకతొలగు మారణమునన
న్నెదరించగ జాలవు ద్రౌ
పదులెందరు వత్తురోడల బ్రాణములుంచే॥

వ. కావున నీప్రాణంబులు గాపాడుకొనుము అని వాయవ్యాస్త్రంబు విడచినగాండీవి దదస్త్రంబువలన నాయస్త్రంబుపసంహ్వారించి॥

అర్జునుండు.

గీ. ఓరికాళింగ నీయస్త్రముర్విగలసె
పదరబోకుము గర్వసంపాదివగుచు
బలముగలవాడు నీరీతిబలుకునటర
పలికినట్టులమెలగితత్ఫలము గనుమా॥

ఓరిమదాంధా తొందరపడకుమని పార్థుండు.

క. గనలుచు ననలాస్త్రముచే
గొనిరుద్రునిభంగిమండి క్రూరాత్మకనీ త
నువుధర దొరుగునని గ్ర
క్కునవక్షస్థలముగాడ గురిగావైచెన్॥

వ. వైచిన నమ్మహానీయాస్త్రంబు చిటచిటధ్వనితో మిడుంగురులుచెదర చూపరులు వెరుగంద నతండువ్రేయు శరంబుల మ్రింగికొనుచు కళింగు రధంబుపయింగవిశి సూతాశ్వరధ సహితంబుగా కళింగునిం దహించిన.

తత్సైన్యంబులుచెదరి నలుదిశలకురక పోనికపాదివినిశితశర పరంపరల నబ్బలంబుల నిలపాలుజేసి గ్రీష్మాదిత్యుండునా వెలుంగుచుండె॥

సహదేవునియుద్ధము.

సహదేవుండును కిరాతపతియగు సరభుండునుం దలపడి సైన్యం

బులకచ్చెరుపాటుదోప నెండోరులపై బాణంబులు నిగుడించుకొనుచు మాటలకుంజొచ్చి సహదేవుండు సురథునితో.

కం. నీవుకిరాతులరాజవు
గావుననుకిరాతగుణముగలవాడవె దు
ర్భావయటుగాకయుండిన
చోవత్తువె సైంధవునకు చుట్టమవగుచున్॥

వరేపాపి నాకంటికగపడితి వింకెందులకరిగెద వితండు రణవిక్రముడగు (సహదేవుండు) వృథా వైరంబునకుజొచ్చి చెడకుము సమరంబు దొలంగిపొమ్ము అనిన సురథుండు.

గీ. ఓరిసహదేవనాతోడ బోరగలవె
హస్తిమశకపు తారతమ్యంబునునకు
హస్తినేనౌదురా మశకంబవీవ
యీడుజాలనిపోరు పోరాడనఘుము॥

వ. గావున నాతోదీటువదలి తగువానిపై గవయబొమ్ము కాదేని సౌవీరుల నునుము సేయు నరునికడకయిన నరుగు మట్లయిన నిన్ను సాధించువారులేరు. పశిబాలుండవు పోపొమ్ము అనియొకశక్తివైచిన సహదేవుండు పొడిచేసి॥

దర్వు - చాపు.

వరే పదరుటమేలా దుర్మతీ యిటుపదిరుటమేలా దుర్మతీ పదరకురాసిత ప్రదరంబులచే నొదుగజేతు దుర్మదనను నెరుగక॥ పద॥

కొద్దివాడవని గ్రద్దరించెదీ పెద్దతనము నాకొద్దియు నగుపడు పదరుటమేలా॥

ధరనుతమ్మలూరి హరిమదిమెచ్చని తరముగాదు నాతోదుర మొనరింపగ॥ పదరుట॥

వ. వరే నన్ను నరునికడ కరుగుమంటివి గదా. నిన్ను శమను పురికనిపి నేనానరునికడకరిగెద ననిన సహదేవుం డొక శరంబున సూతు



నిలబడవేసిన నతండే రథ్యంబుల నడుపుకొనుచు నొక శరంబున సహదేవుని ధనుర్భంగంబుజేసి నవ్వుచు.

గీ. బాలుడవు పెక్కుమాటల ప్రేలబోకు
సమరమున నాతొ భోరంగ జాల వీవు
ప్రాణములు గాచికొనిపొమ్ము పాపమనుచు
దోచె నామదికిక నెదుట దొలగు తొలగు.

మా॥ శరణని దురంబువిడచి నాకెరుంగబడని మరుంగున డాగియుండు పోపొమ్ము.

గీ. అనిన సహదేవు డతిరౌద్రుడగుచు నొక్క
దివ్యబాణంబు తెగనిండదీసి విడువ
నదియు వక్షస్థలము దూరి యవనిజొచ్చె
నంత సురథుండు గూలె నయ్యగనమందూ

మా. ఇట్లతండు పడిన సహదేవుండు సింహనాదంబు సేయుచు సురథు సైన్యంబుల నురుమాడుచుండె నంత.

భీముని యుద్ధం.

మాటలు. భీమసేనుండు మదగజంబులన్నియు పృథివి పాలుగావించితి నింక మదాంధుండగు సైంధవుపై కరుగవలయునని భీముండు గదా హస్తుండై సింధుపతిదెసకు నడుచుచుండ గోటికాస్యుండు తన బలంబులంజూచి. దండనాథులారా సకల దళంబులు సమరంబున సమసె పాండవులు బయలున మెరయుచున్న వారు. గదగొని భీముండు జయద్రథుదెసకు చిచ్చుపగిది వచ్చుచున్నవాడు నీట్టి సమయంబున నాజగజెట్టి కడ్డంబుసారమేని ప్రథమ కబళంబురీతి సైంధవుగబళించుగాన నేను భీమసేనుతో దలపడ బోవుచున్నవాడ మీరలు కలసిరండు అని వాడు గదాహస్తుండైజని భీమసేనుని కడ్డంబు నిలచి.

క. ఎందు జనువాడ గాడుపు
నందన యే గోటికాస్యుడను నెరుగవె నా

ముంధర నీబింకము లా
నెందింపవు నిలువుమిపుడెననిబడవై తుర్

వ. వరే గోటికాస్యా యే మంటివి.

దర్వు - సంవ్వాదం - చాపు.

ధట్టించి పదమున మట్టుబెట్టెదను మిట్టిపడబోకుర దుర్మతీ నెట్టాన ద్రౌపదిని బట్టిగొంపోయెదు నట్టితులువచేపట్టీ తివిరనిను॥గో॥ ధ॥

వరే భీమా. కండాలుబెంచూక మొండూగబలుకూచు దండివాడనను-చుండకుమా కొండగుహాల యందుకడు మృగంబుల చెండుగాదఖండ బలుండను॥ కండాల్॥

వరే గోటికాస్యా నాకు ప్రాణపథం బీగద అట్టి.

క. గదకు బహు నాళ్లనుండియు
కదనము లేకుండె నేడుగలిగెను నాపై
విధికెంత ప్రేమయో ని
న్నెదుటను గాన్పింపజేశె నెంతసుదినమో.

వరే భీమసేనా.

క. సమరమున నన్ను మార్కొన
గమకించుట చెడుటకొరకె గర్వమడగునే
నమిత బలుండను నీవీ
క్రమమున బోగలవె గోటికాస్యు నెరుగవే.

భీముండు-వరే గోటికాస్యా,

క. ఎరుగుదు నిను నోదుర్మద
యెరుగక నాతోడ నీవు నెదరించితి భీ
కరగదచే బడెనాయువు
సరిపోయెను నింక నెందుజనెదు నిలువుమా.

వ. వరే భీమసేనా గదయని పలుమారు బెదరించెదవు నేనును



గదా యుద్ధంబెరింగిన వాడనే యేల విర్రవీగెద వీగదతో నరుగుదెంచిన వాడ కదశిరమ్ము నీకుశలంబు గనియెద నని.

క. గదనెత్తికొనుచురాగా
గదచేభీముండువాని గదపొడిశేయర్
గదభగ్నవి కలమానసు
గదబెట్టుగద్రిప్పివైవ గాథరగూలెర్॥

వ. ఇట్లు భీముండు గోటికాస్యునివధియించి తద్బలంబులచే జిదియగొట్టుచుండ.

సైంధవుండు సమరస్థలంబు వీక్షించి అయ్యయో రథ గజ తురగ పదాతిసైన్యంబు లింతకుముందు నేలయీనినట్లుండె నిప్పుడు సమరస్థలంబున నొక్కండు దక్కకుండసమసిరి పాండవులు దీప్తాగ్నుల చందంబు బయలున వెలుంగుచున్నవారింక నెవ్విధంబున ప్రాణంబు గాపాడుకొనియెదనో మనంబు వికలంబగుచున్నదే హా ద్రౌపదీ ?

ఉ. అక్కటసామజాది బలమంతయుదిట్టిన యెట్లుగూలె ని
న్నిక్కడగొంచురాగనిటు హీనతవాటిలె నీదుకూర్మిమా
కెక్కెశిరంబు కింకది.ఘమీయరదంబుననుండి వేగమో
రక్కసివెంతదాన రణరంగముజూడగ దుఃఖమాగదే॥

వ. నిన్నుగొనివచ్చినమాత్రముననే నింతజన భక్షణంబు జేసితివి నిన్ననుభవయోగ్యగా జేసుకొనువారి తనువుమనునె మహారాక్షసివి కావునగదా పంచపతుల వరియించితివట్టి నీపొందుచాలుఛాలు నింకనీయరదంబుననుండక దిగిపొమ్ము అనిన నాననంబున చిరునగవంకురింప ద్రౌపది సైంధవుతో.

క. ఈతెలివి మున్నె గలిగిన
నీతెరగున సకలబలము లిలపాలగునా

మా. వరే సైంధవ నీవుచేసిన దోసఫలంబు సైన్యహారణంబుతో బోతే

కృతార్థుండవే నన్నుదిగమని నీవెచటకయిన నరిగి డాగి ప్రాణంబుగాపాడుకొనవలయునని జూచుచున్నవాడ వదిపొసగనేరదు.

క. భూతలమును దూరిననునీ
శాతశరంబులనుగూల్చు శక్రసుతుండుర్॥

తప్పదు నామాటనమ్ము ప్రాణంబుపైయ్యాశవదలుమని ద్రౌపది. రథంబుదిగి నిలచిన సైంధవుండు దనమనంబున.

గీ. ఒంటిజిక్కినాడ బంటులు సమసిరి
యక్కటక్కటయెందు నరుగువాడ
పాండుసుతులచారి బడకుండప్రాణంబు
గాచుకొనెడు పథము గానరాదు॥

మాటలు.

ఈస్థలంబువిడచి రథంబుదోలుకొని గానవచ్చుచున్న నల్లాతరుషండంబుదాటి ఘోరారణ్యంబుప్రవేశించితినేని పాండవులు గనజాలరు. నావద్ద పాండవాంగనలేనందున నాజాడవారలంతగా పరిశీలింపరు ద్రౌపదిందోడ్కొని యాశ్రమంబునకరుగుదురు. తదనంతరంబ ఘురియొక మార్గంబున పురంబునకుబోయెద.

గీ. ఇప్పటికిజూడనిదిదప్ప హితవులేదు
పరిహరింతురు నింతేకా పారెదంచు
పఱువరంగమలొత్తుదు ప్రాణమున్న
లవణమునుమ్మక బ్రతుకవచ్చవనియందూ॥

వ॥ అనికృతనిశ్చయుండై రథంబు సత్వరంబుగా దరముకొను చరుగుచుండే.

నిట శత్రుసేనా సంరంభంబునన్న భీమసేనుంజూచి పార్థుండు.

ఉ. పారదోడంగసైంధవుడు భామినినొంటిగడించిభీతుడై
నేరణమందుసైన్యముల నేలవృథావధియించెదింకనా



క్రూరునివెంటనంటి శరకోటులబల్విడిద్రుంచివైతమో
ధీరపరాక్రమప్రకట తేజుడవేచనుదెమ్ము మద్గ్రజా॥

వ. అనిపలుకు పార్థుపలుకులాలించి భీముండు సమరంబుచాలించి ధర్మజ నకుల సహదేవులంజూచి॥

క. రమ్మగ్రజ రానుకులా
రమ్మాసహదేవవేగ రమ్మిందరుదూ
రమ్మెగె సైంధవుడుమన
కొమ్మను దిగవిడచిసైన్యమూకలనడపర్॥

వ॥ అనిన ధర్మజనకుల సహదేవులు భీమసేనుంగదిశి వారలు నలువురు పార్థుండున్నయెడకరగి రందరుంగూడుకొని దృపదనందన యున్నచోటికి జనుదెంచి రంత ద్రౌపదిపతుల కెదురుగాజని వారలు రథంబులు డిగిన యనంతరంబా సమీపించి హస్తంబులుమొగిచి పతుల నవలోకించి॥

దర్వు - ఆది.

వందనములు మీచరణారవిందములకు నాథులార॥ వంద॥

సింధువిభుని బలములానిల ప్రమంద గానాడెందము కానందము గల్గించితిరిదె॥ వంద॥

వంటరిగను నాశ్రమమున జంటనెవరు లేరనినా కంటకుండు గొనివచ్చెనుయాతుంటరియగు కొంటెయుమీవంటిపతులుగల్గవిడచె॥ వం॥

ధరనురాఘవరావునేలు పరగసీతారాములా కరుణయుండగరటి నీ శుభచరితుల నరివీరుల కురువరులను పావనులనుమిము॥ వం॥

పదివేలవందనములు నాథులారా ?

మానినీ సహస్త సన్మంగళానిభవంతు॥

వ॥ అనిదీవించి ధర్మజుండు పరమహర్షంబున ద్రౌపదింజూచి॥

క॥ మానిను శత్రునిచే నవ
మానము వడకుండమాకు మదిరంజిల్లన్
గానగు పడితివి పుణ్యావ
మానపతివ్రతవునిన్ను నోరులంటుదురే॥

వ॥ సుదతి మేమెవ్వరములేనితరి నొంటరిగా నక్కంటకునిచేబడి యెంతభీతినొందితివో కదా.

అనిన ద్రౌపది ధర్మరాజుతో.

ఉ. అనుపమధర్మతత్పరుడవాహవశౌర్యులు నీదుసోదరుల్
ఘనభుజలేవ్వరెల్లపుడు గంటికిరెప్పదెరంగుమీరలున్
ననుదగగావనొండొకడు నన్మతిపొందదలంపమేనితో
మనునెభవత్సతీమణికి బాధలుగల్గునెప్రాణనాయకా॥

అనిన ధర్మనందనుండు.

వ. ద్రౌపదీ సురక్షితవై మాకంటికగుపడితివిగాన మనకిది మంచి కాలంబనుచుండ భీముండు ధర్మనందనునితో॥

గీ. ధౌమ్యసహదేవనకులులు ద్రౌపదియును
గలశిమీరాశ్రమమునకు గదలుడెంతో
దప్పిగొన్నారలాహవస్థలమునందు
సైంధవుడుదక్కబలములు సమసెదేవా.

వ. మరియు ధౌమ్యమునీంద్రులు చాలాపథశ్రాంతులయి యున్నవారు అగ్నిహోత్రకాలం బతిక్రమించుచున్నదిగాన వీరలందొక్కని యాశ్రమంబున కరుగుండు.

ఉ. ఏనును పార్థుడర్జునియు నీశ్వరుసత్వము లేర్పడంగనా
హీనుడుమింటికేగిన దహింతుము వారిధిలోనడాగినన్
దీనతజెంది వేడినను తేజము సంగరమందు మాన్పియున్
వానిశిరంబుదెత్తుమిట వారిజలోచన సంతసింపగన్,



ఆదురాత్ముండు చాలాదూరంబరిగియుండును వేవేగబోయెదము గాన శలవొసంగు ధర్మజా అనిన ధర్మజుండు భీమునితో

దర్వు- ఆది.

అనిలనందనా వాని దునుమదగునా॥ అని॥

అనిలో మనలగని దీనతవని దూరగజనె భయమున ననిలనంద బలములెల్లనూ మనవలననీల్గెనూ॥

నిలువలేకపారువాని తలగోయుట కులధర్మమె॥ య॥

జడునికొరకు నీతివిడువగాబోకు పుడమి తమ్మలూరిశౌరి యుడుకునుమన నడవడిగని॥ అనిలనంద॥

వ. మనకాంతనువదలి ప్రాణంబుకాపాడుకొన కాననంబున కరిగె. సమస్త సయిన్యంబులు సమసె వానికిదె ప్రాయశ్చిత్తం బీచిన్నతనంబు చాలదేభీమా.

అనిన భీముండు రౌద్రాకారుండయి ధర్మజుంజూచి యేమీ నీ ధర్మంబు చాలుచాలు.

దర్వు - చాపు.

పాపాత్మునికృపజూడకు మిపుడో భూపకులాదీ॥ పాపా॥

యీపట్లను మత్పదమునవానిని రూపుమాపెదను కోపగించకుడు॥ పాపా॥

సోదరినెత్తుక గొంపోయెడు హీను నాదరింపదగునా యీదృపదాత్మజ మోదముబొందగ నాదురాత్మకుని ననిబడవైచెద॥ పా॥

ఇలనుతమ్మలూరి నిలయుడుమెచ్చగ శలవొసంగుదేవా వలదను పలుకులు బలకకుడాతని తలదునిమియు మిముదలచెదనిలచెద॥ పా॥

వ॥ అని భీముండు బల్కుచుండ ద్రౌపది ధర్మరాజుంజూచి నాథా ?

ఉ॥ చుట్టమటంచు నెంచి ప్రియసూక్తులపూజవ లాచరించినన్
నెట్టనమీరు లేనితరి నేనొక దానననుండవాడు తో
బుట్టువనంటగూడదని బుద్ధులు నేనెరిగింపనోడకన్
బెట్టుగ స్యందనంబు పై బెట్టెనతుచ్ఛుని నాదరించెదే॥

వ॥ ప్రాణనాథా నా ప్రార్థనయంగీకరించి యీ భీమపార్థుల నంపితి రేని క్షణమాత్రంబున ధరణీపాలు గావింతురుగాన నొద్దనబోకుడు.

దరువు.

ధారుణీవరా వానికరుణింతురా మీరి క్రూరసర్పములకు క్షీరములిడి బెంతురా॥ ధారు॥

శిగ్గువిడచెనా దగ్గరాజేరే నగ్గుణహీను బ్రోవమీద నెగ్గుదలచు మీకయ్యోయో॥ ధారు॥

యెంచదగునా మన్నించగూడునా వంచెనమీసతిని యోచించక గొంపోవు॥ హీను॥

జాలిజెందగా నన్నుకాలద్రోచెగా ఇలనుతమ్ములారిత్రాము డల రుపీని ద్రుంపగా॥ ధారు॥

మాటలు.

మానినీ యమ్మానవాధముండు కానిపనికిబూని సైన్యహానియు నపకీర్తియు సంపాదించుకొనియె నపకారికి నుపకారంబు సేయుట యుక్తమధర్మంబని పలుకుదురింక వానితో డిదేమి మనకు శాశ్విత కీర్తియు శరణాగతరక్షణంబు జేసిన ఫలంబు గలుగునుగాన వేగిరపడకుము భీమ పార్థులారా.

గీ॥ అరయకమతిమైన వెరచి రణంబున
పారెనేని వాని పట్టజనదు
కర్ణవన్ను గూర్చి కావుడ త్తులువను
జంపవలదు ధర్మ చరితులారా॥



వ. ధర్మబాహ్యంబయి యెంతసుఖంబు గలిగినను ప్రయోజనంబుండదుగాన ధర్మంబువిడువకుడనుజులారా॥

(అనిన భీముండు కోపంబుతో).

ఏమీ వాని వరుసవదలి సోదరిని గవయగోరి బలాత్కారంబుగానెత్తుకొనిచను దుర్మార్గుండధర్మాత్ముండు నట్టిదురాచారుని బరిమార్పనరుగుమే మధర్మపరులమా ? కలకాలం బిట్టుల పలుకుటవలనగదా మనకీ దురవస్థలు సంభవించె నాసుయోధనుండుచేయు దుష్కార్యంబు లపుడేమరచితిరి॥

సీ. కాలకూటంబిడి కాలసర్పంబుల గరపించెగంగలో గట్టివైచె। మరచి
నిద్రించెడు తరిలక్కయింటిలో చిచ్చిడిజూదాన శిరిహరించె। పాం
చాలపుత్రిని పట్టుపురసన్నిధి తలపట్టియీడ్పించె వలువలొలిచె। న
డలెడుమనలను నడవికంపియు ఘోషయాత్రనెపంబున నపహసింప।
రమణులతో వచ్చి గంధర్వరాజుచేత। కట్టువడగాచితివి. ధృతరాష్ట్ర
సుతుల। నిపుడుచంపంగవలదంటి వితనినింక। నెటులరాజ్యంబు రా
నేర్చు నిట్టులయినా॥

వ. గాన వీని మన్నింపబోకుడు అగ్రజా అనిన ధర్మనందనుండు భీమసేనా నీవాడిన తెరంగు యథార్థంబె అయినను గతజలసేతుబంధనంబు ఆదుర్యోధను నన్నితప్పులకు మన్నించితి నీసైంధవుం దుస్సలందలంచి యొకతప్పులోగొనవలయు.

క. కురుపాండవులకు సోదరి
యరయగ దుస్సలదు గాత్మసనిలో ద్రుంపన్
పురపురబొక్కిన మనకా
దురితముదప్పకనునంటు దోర్భుజశౌర్యా॥

నిదియునుంగాక,

గీ. ఏకపుత్రికవై ధవ్య మేర్పడంగ
నందులకు నాంబికేయుడు నతనిభార్య

చింతచేగుందినొక్కట జీవహత్య
జేసికొనమనల గురువులు చెనటులన రే॥

వ. ఇంత కాలంబు కష్టంబులకోర్చి గురుపితామహులచే ధర్మపరుల మని కొనియాడబడి యీస్వల్ప కార్యంబునకై శ్రమజెంది యార్జించిన సుకృతకీర్తులు పోగొట్టుకొనవేల యాదుర్మార్గునివధియింపక స్వప్రాణముతో యాశ్రమమునకుగొనిరండు నామాటలువినుండు అని ధర్మజుండు బలుక భీమార్జునులు సమ్మతించి అన్నా మీయాజ్ఞానుసారముగా మెలంగువారము మీరలింక నాశ్రమమునకు వెడలుండని భీమపార్థులు రథంబులెక్క జనుచుండ ద్రౌపదివారలతో.

ద్రౌపది- దర్వు- కాంభోజి ఏక.

భీమపార్థులార వాని బింకమడచిరండికర్ యీమహాత్ము డెపుడుధర్మ మెడలకుండబలికెడిర్॥

అన్న పలుకులన్నరీతి మన్నించాకుడాతనిర్ ఎన్ని విధములా చెనయిన వన్నెమాన్పిరండనిర్॥

వ. నాథులారా మనోరథంబు సఫలంబు గావించుకొనిరండు. ద్రౌపదీ యప్పాపాత్ముని తెరంగుగని నప్పటికిదోచిన తెరంగున కార్యంబుగావించుకొని వచ్చువారము పోయివచ్చెదమని జనుచుండిరి. నిట ధర్మజుడు ననుజద్రౌపది సమేతుండయి తనరథంబున ద్రుపదనందనను నిచికొని ధౌమ్యుడున్నయెడ కరిగి.

యమ్మహాత్ముని నకులుస్యందనం బెక్కించుకొని యాశ్రమంబునకుజనుచుండిరి. ధౌమ్య, ధర్మజ, నకుల సహదేవులు నిష్క్రమించుట.

ఇట భీముం డర్జునుంజూచి ధనుంజయా పగతుండు చాలా దూరంబరగియుండును వాడిరథంబుచనిన యీమార్గంబున మనయరదంబు లతిత్వరితగతి నడుపుదమురమ్ము అని కొంతదూరంబరగి క్రోశమాత్రాంతరదూరంబున సైంధవురథంబు పొడగాంచి అర్జునుండు భీముతో.



గీ. అనిలనందనగను రథమతిజవమున
దోలుకొనిపోవుచున్నాడు దూరమునకు
శరములచేఘోటకంబుల సమయసేతు
నెందుజననీకపట్టుమా సింధుపతిన్.

వ. అనుచు సైంధవుని దురంగంబుల భూమిపయింబడనేసిన విరథుండయి మరలచూచి.

గీ. ఎందుబోవువాడ విదెపాండునందనుల్
సేరవచ్చిరేమి సేయుదకట
పరమపుణ్యవతిని బట్టినదోషంబు
తప్పకిపుడెవెంట దగిలెనహహా॥

మాటలు

హా ! ఈశ్వర ఇంతవిపత్తుకలుగునని కలనయిన నెరుంగనయితిని సయిన్యంబులన్నియు సహయుటయేగాక నాకునసాయంబు కలుగుకాలంబుసమీపించె. హా యింకనేరీతి నీగండంబు గడుపుకొని బ్రతుకువాడ.

సైంధవునిదర్వు- శోకవిరాళి- ఆదితాళం.

దైవరాయ యెదారిలేదాయె కావబూనునాట్టి ఘనులు లేరాయె॥ దైవ॥

ప్రాణమూకాపాడుకొనుటెట్లానేడూ కాననమూనా నొంటిగా జిక్కి తినయ్యో॥ దైవ॥

ధరతమ్ములూరీహరి కరుణాలేకానరి శరమూలబడ్డానుదుటా విరించివ్రాశెనే నకటా॥ దైవ॥

వ. అనిదుఃఖించుచు మరలిచూడ పాండవరథంబులు సమీపించి వచుచ్చుండ.

గీ. అక్కటాపార్థివోత్తము లరుగుదెంచి
రేమి శ్రేయుదునెటుబోదు నింక నేడు

తలపులొక్కటి దైవంబుతలపులొకటి
పెండ్లికనిరాగ నీపెద్దపెండ్లియయ్యో॥

వ. హా ! విధియేమి శేయుదు నెట్లు తప్పించుకొనుదు యిప్పటి కల్లా పొదలోదూరి శత్రువులకగుపడకుండా పర్ణములు గప్పుకొనియుండె దనని సత్వరంబుగాజని గుల్మంబుప్రవేశించుచుండ భీముండు రథంబు డిగ్గి గూడంబారి పొదలోదూరుచున్న సైంధవుందాకి.

గీ. ఓరిసైంధవ యింకెందుదూరగలవు
కంటికగుపడితల్ల ముక్కంటితోడు
పడినబోవచ్చునే నీవుపాపమునకు
జొచ్చిప్రాణాంతమునకును దెచ్చుకుంటి॥

వ. అని తన వామకరంబున వానికరంబుబట్టుకొని లాగుచూ.

దర్వు- మధ్యమావతి జుల్వ.

రమ్మ రమ్మవేగసైంధవ లేచిరమ్మ

అమ్మదిరాక్షసి సొమ్మనిగోరితి విమ్మహి నీవీవాహమ్మ శేతుగా॥ రమ్మ॥

పందవై బలములు పకపకనగ పదినుందిజూడగ రణమందుండ పారితివి॥ రమ్మ॥

ఇదెనీకు మృత్యువై యేగుదెంచినాడ పొదయెందుడాగినా బోనిత్తునానిన్ను॥ రమ్మ॥

ధరతమ్మలూగీ (శ్రీ)హరివిన్న చీయనుదురమూనజచ్చిన సురగతిగల్గురా॥ రమ్మ॥

వ. వరే నీకొరకై వచ్చినవాడ నేనేయంతకుండ మత్కరగజే కాలదండంబు నీప్రాణంబుగొనకమాన నింక వెలుపలరమ్మని బెట్టిదంబుగాలాగిన నతండు కరంబున గుల్మంబు గట్టిగాబట్టుకొని.



క. అయ్యో నములాగకు మ
ఒరే విడువను వెలుపలరా.

క. యయ్యో బ్రతుకంగజాల నంగమునొచ్చె

వ. ఏమీ ద్రౌపదిని రథంబున నిడుకొని వచ్చునపుడు శరీరంబు నొవ్వలేదా నీచా యీపలుకుల ప్రయోజనంబు లేదు ఛీ రమ్మ.

క. అయ్యో కానకచేసితి

వ. వరే గానుగలో చెయ్యినిడి పరమేశ్వరుని కృపయుండవలయు నన్న చెయ్యి నలుగకమానునా గనిచేసినను కానకచేసినను మానువాడగాను బయిటికిరమ్మ.

క. అయ్యో యికదెలిశె గావుమయ్యాభీమా ?

వ. ఒరే తుచ్ఛా యింతకుముందు నావలననేమి లాభంబుగలిగె గావ దెలిశెనంటివి. నీవు మాకు బాధుండవు రాకరాకవచ్చినవాడవు లేచిరమ్మ ముష్టిఘాతంబుల విందుసేసెదనని బలాత్కారంబుగా లాగిన సైంధవుండు నిలువనోపక.

క. హావిధికి నేమిదురితము
గావించితొ యింక నెట్లుగానున్నానో
చావుకు మరి చావగునా
నీవిధముననన్ను వదల డీతండకటా॥

వ. అని తెంపుచేసి భీముపయింగవిసి హస్తంబుల నతని బిగియబట్టిన భీముండు పట్టువదలించుకొని మరలవాని నెడిసిపట్టి బెట్టుగా పయికెత్తి భూమిపయింబడవైచి యతికోపంబున పాదతాడనంబు సేయుచు.

దర్వు - శంకర-ఆది

బెనగొనియెదవా సైంధవా నాతో బెనగొనియెదవా సైంధవా- నినుననిద్రుంచగ జనియించితిరా ఘనతరముష్టి నవనిపాల్ సేతుర.

వ. భీమసేనమహారాజా యీగ్రుద్దులకు తాళజాల కావుమయ్యా.

ద॥ శాతశరంబుల ప్రీతిగ నీతలగోతుర యికనీతాతయడ్డమా॥ బేన॥

వ॥ అయ్యో భండనవీరా నీశరంబుజూడగానె నా ప్రాణంబులు శావు లుదప్పె చంపకు చంపకు రక్షించుస్వామీ॥

ద॥ పాతకినేడు నాచేతబడూమాని ధాత నుదుట మూడు గీతల వ్రాశెరా॥ బెన॥

వ॥ పాండవవంశోద్ధారకా నేనాలుబిడ్డలుగలవాడ కుటుంబ దానం బుజేయు యీతన్నులకు బ్రతుకజాల.

ద. ధరనుతమ్ములూరి సరసిజనాభుడు కరుణగాచినను బోరిగొం దురనిను॥ బెన॥

వ. అని భీముండు బెట్టుగాతన్నుచుండ సైంధవుండు.

దర్వు - అఠాణా ఏక.

పాదతాడనములకోర్వ పావనిననుగావుమా బాధగల్గె దేహమెల్ల పగిలిరుధిరమెడలెమీ॥ పాద॥

దాసరిచేయుతప్పులు దండముతో సరిగాజూడుమా దోసిలొగ్గి నాడ ప్రాణముగాసిజెందె విడువుమా॥ పాద॥

పరగరాఘువరావునేలు వరదసీతారాములన్ మరువకను స్మరి యింతునీకు శరణు శరణూ బ్రోవికన్॥ పాద॥

అనిన.

వ. వరే మదాంధా యీనక్కవినయంబులువూను నీవెంతదుః ఖించినను నీవుచేసినపనికి నీయందు నాకు కరుణ లేశముయినను దోషదు నీప్రాణంబు గొనకమాననని వక్షస్థలంబుపైగూర్చుని కరవాలంబుచే బూన సైంధవుండు గొప్పగా కేకవేయుచు అయ్యయో భీమా చంప కు చంపకు నన్నురక్షించు నీకు వందనంబులుదేవా అని దుఃఖించు చుండ నర్జునుండు సమీపించి.

క. ఓవాయుపుత్ర జంపకు
నేవచ్చుచునున్నవాడ నిలువుమీతన్నం



గావలదు దీనరక్షణ
భావంబుననిల్పువాని పాపము భీమా.

వ॥ అని పార్థుండుపలుక భీముండు వక్షస్థలంబువిడచి భూమిపై నిలువంబడియె వాడును మెల్లమెల్లగాపొరలి కూర్చుండ నింతలో పా ర్థుండు రా సైంధవుండు హస్తంబులుమోడ్చి॥

దర్వు - ముఖారి - ఆది.

పార్థా శరణాగతరక్షక నా ప్రాణముగాపాడూ
నిద్రా యాత్మకుడై భీముడుగ్రుద్దె మేన బ్రద్దలాయె॥ పార్థ॥
మానా కనునే జేసినదోసము మానసమందుంచకుడూ దీనూ డనుచుజనుడ బంధుడగాన కరుణగాచి విడువు॥ పార్థ॥
వానీ గలిగిన తమ్ములూరి పురవాసుని మదిదలచుచు మీదాసూ డానని సభలందున దోసిలొగ్గి బతుకువాడ॥ పార్థా॥

వ. అనిన పార్థుండు సైంధవుని జూచి.

ఉ. ఏమనగూడు నింక నతిహీనుని నింద్రియలోలు నిన్ను నీ
భూమిని యిట్టితుచ్ఛునిగబుట్టగ జేయుట బ్రహ్మతప్పు సం
గ్రామముగోరిరాగ ననుగావుమ వేడెదు ప్రాణరక్షకై
నేమిముదాక లేననుచు నేడ్చెదు నీతను వేలగాల్పనే.

వ. అని యుయ్యర్జునుండు జయద్రథుతో బలుకుచుండ భీముండు.

దర్వు - కాంభోజి - ఏక - సంవాదం.

భీ.—కరుణించబోకు పార్థవీని గర్వమణగ నీ దురితాత్ముడితని శిరము
మత్సరమున దరిగెదను॥ కరుణిం॥

సైం.—అయ్యొయ్యో భీమా అన్న పలుకులాదరింపుమా అయ్య మా
తనయు కరుణపాత్రుడయ్య వీని విడువుమా॥

భీ.—వాడామ పార్థవీనివిడువగాదు నాకికన్ క్రోధామునంతకంత కధి
కమూ ద్రౌపదివిన్న నేమన్నున్॥ కరు॥

అ—వాదగును భీమసేన వీనిబాధసేయగా మోదంబుగల్గునట్టుగానె ద్రౌపదీకి బోధసేయుదుర్॥

భీ—యింతగనూ పార్థనీకిదేలవీనిపై కృపా సంతోషమాసమంథమాని కాంతగాదె ద్రౌపదీ।

అ—దుర్మార్గుడితడు భీమసేన ద్రౌపదీసతే ధర్మాత్మమాట మిగుల తమ్ములూరిథాముడూ చునసేమనూ॥

భీ--సీ. పార్థ ధర్మజురీతిపల్కెదు నీవు మీయిద్దరి ధర్మంబునింత జేసె। నిలగల నృపులనూ గెలచి కూర్చినయెట్టి ధనము సుయోధనుడును హరించె। నారచీరెలుగట్టి నారీమణినిగూడి ఘోరకాంతారముల్ సేరవలసె। మనము భుజింపజేర్చిన వస్తువులు శత్రుజనములు సుఖముగా ననుభవించి। రనుమ దినమును తలపగా రానియట్టి చింతచేనుండ నేటికిజిక్కెవీడు।విడువువిడుమనియెదునెట్లు నీనుడువువచ్చె చాలు పదివేలు నీనీతిచాలు చాలూ. అనిన పార్థుండూ.

వ. భీమసేనా తొందరపడకు మన మెంత శౌర్యవంతులమైనను ధర్మజునికీర్తి జగద్వ్యాపితంబై సర్వము నీశ్వరవనీయంబై శ్రీకృష్ణ వ్యాస విదుర కృపగాంగేయ ద్రోణ సమ్మతంబై యొప్పుచున్నదట్టి ధర్మనందను పలుకులు మిగులంగూడదడియునుం గాక.

గీ. ధర్మపథమునుదప్పడా ధార్మికుండు
నగ్రజునియాజ్ఞ మిగులరాదనిలతనయ
జూతుమేరాజువడశె నజాతశత్రు
డనెడునభిధాన మదిమది గనగదయ్యా॥

వ. మనకంటే నతిసుకుమారుండయినో ధర్మజుండడవుల నిడుమలుగుడుచుచుండుట నీవుగానవా నమ్మహాత్మునియాజ్ఞ మీరితిమేని మనబలంబులు శస్త్రాస్త్రపటుత్వంబులు సత్వహీనంబులుగావే అపకారిని రక్షించుట యుత్తమంబుగదా, కావున.



గీ. అయ్యయోయింక గాసిజేయంగజచ్చు
ధర్మజునియాజ్ఞమీరుట దగదుమనకు
కంఠగతమయ్యె ప్రాణంబు గావవలయు
వీడుమీదాసుననె విడువిడువుమయ్యా॥

వ. ఇంక నితనిని ధర్మనందనునికడకు గొంపోవుద మితనికిదియె ప్రాయశ్చిత్తంబు ఆశ్రమనివాసులు ద్రౌపదిమొదలగువారలుచూచి పరిహసింతురు దాహంబగుచున్న దింక శాంతిపొందుమగ్రజా అనిన భీముండు ధనుంజయా వీనికిదియెచాలు విడువుమనియెదవా విడచెదను గాని ధర్మజువద్ద కీరూపంబుతో గొంపోవ నితనిని విరూపినిజేసెదనని ఖడ్గంబుచేబూని సైంధవు సిరోజంబులుబట్టి.

దరువు- కాంభోజి రూపకం.

బావా యీవేళసిచేరేవులు బడగోరిగెదరా బావా నీవెన్నడు పరవనితలగావలెననబోవుగదాయిక॥ బావా॥

బంధుండవు నీవెందులకిం దరుదెంచెదవన్నవుడు మాయెందు గలకృపచే మాసుందరిగోరితి సందేహింపక॥ బావా॥

అప్పాడపుడుమముగన తప్పరా యిప్పటివలె గొప్పగానిను జూతుము చెప్పుకొనుము నీతిప్పలుకురుసభ॥ బావా॥

భాసూ రంబగుతమ్ములూరి వాసునిమదిదలచియునీ మీసంబును గడ్డంబునుగోసి వివాహముజేసి విడుతురా॥ బావా॥

వ. అనిభీముండు శరంబుచే నొకచంపయు మీసంబును గడ్డంబునుంగొరిగి విరూపింజేశి విజయుండునవ్వుచుండ రథంబునకంటగట్టి భీముండు సైంధవుంజూచి॥

గీ. జూడుసైంధవ యెవ్వరివాడవీవు—అనిన సైంధవుండు
పాండవోత్తమ మీశేవకుండనగుదు—అనినభీడుండు
సభలలోపలనేమని చెప్పుదువికను—అనినసైంధవుండు
పాండుసుతులకు ముఖ్యదాసుండనందు—అనినభీముండు

వ. వరే ధర్మనందనుకడకు వచ్చెదవా దేవా మీయాజ్ఞకు బద్ధుండ

నయి మీారెచ్చటికి గొంపోయిననువచ్చువాడ ధనుంజయూరథంబెక్కు, పోవుదము అని సైంధవసహితంబుగా రథంబులుదోలుకొని యాశ్రమంబునకు వచ్చుచుండిరి నిట ధర్మనందన ద్రౌపది ధౌమ్యు నకులసహదేవులాశ్రమంబుననుండి ధర్మజుడు ధౌమ్యునింజూచి మునీంద్రా సోదరులురారయిరి ఆదురాత్ముండు చాలా దూరంబరగియుండవచ్చును.

ధౌమ్యు — రాజేంద్రా వచ్చుసమయంబయ్యెననుచుండ భీమార్జునులు సైంధవుంగొనివచ్చి ధర్మజునియదట నివేదించిన ధౌమ్యమునీంద్రుండు సయింధవుంజూచి॥

చ. పరమపతివ్రతామణియు పాండుతనూజులధర్మపత్ని
నీవెరుగకగోరదక్కదరిపీరులు నాహవరంగమందుదు
ర్భరశరజాలముల్ బరపి పంచతనొందగ జేతురంచునే
గరపిన వాక్యముల్ మదికి గావుగదాయిపుడయినదోచెగా.

వ॥ ఛీదుర్మార్గా యిప్పటిదోసంబిపుడే యనుభవించితివిగదా నీతో మాటలాడ మహాపాతకంబునగునని ధౌమ్యుండుబలుకుచుండ నకులుండు సైంధవుం జేరి ఓరిదుర్మార్గాగ్రేసరా.

చ. పరసతిగోరువాడు నతిపాపియటంద్రుమునీంద్రులెల్లసో
దరిగవయంగబూను నతిధర్మవిరుద్ధుని గన్నదోసమీా
దురితముకెట్టులోర్చెమదిదుర్గుణఛీనగిరందరింకనీ
వురివిషమగ్నిశస్త్రముల నుర్విదొలంగుము మేనుదుర్జనా॥

వ. ఈరూపంబున పురంబునకరిగి దారసుతాదిజనుల గనుటకంటె యీవనమృగంబులకు తనువప్పగించుటమంచిది అనిన సహదేవుండు వీడికాబిడియంబుండెనేని సమరంబుననే హారణంబుగాడె.

ఒరే సంయింధవా విను.

ఉ. తుచ్ఛపుజన్మమెత్తి యిటుదుర్గుణజాలములెల్లనేర్చిని
యిచ్చకువచ్చురీతి జరియించుచుసంగరధాత్రి నిల్వలే
కిచ్చటికేలపందవయి హీనతవచ్చితి సవ్యసాచిచే
జచ్చిననేమియుంగనలు సంతసమందరె స్వర్గమబ్బదే.



వ. నీచా నీసంబంధంబువలన నూభరతవంశంబంతయు మలినంబయ్యె నిట్టి నిన్నుగొనివచ్చి ప్రాణంబుతో మాయదటనిల్పిన భీమార్జునులను ననవలె ఛీపొమ్ము అని సహదేవుండుబలుక ద్రౌపది భీమునకు సైంధవుంజూపి.

దర్వు- కాంభోజి ఆది.

ఈతడెవ్వడనిలనందనా వీనినీతీరుజేసిన నీతిబలశాలెవ్వ॥ రీత॥

వ. అనిన భీముండు ద్రౌపదితో.

దర్వు- పట్టినువీడు సైంధవుండు కామలోలునెరుగవటవే॥ భామ॥
నేడు నానుహోగ్రపుశక్తినీ మహిమవడసెను యెంతపనిచేసితి
రి నుతింపదరమె నాధమీా॥ రెంత॥
మదిచింతదీర వీనికింతప్రాయఃచిత్త॥ మెంత॥
ధామణిలో తమ్ములూరి ధాముని కృపయుండగా నిన్నుకోరి నిల్చు
వారే జేరారె యమపురి॥ భామ॥

వ. నాధా మంచిపనిగావించితిరైనను వీడు నన్నుగొంపోవుచు వచించరాని దుర్భాషణంబులనేకంబులాడె నట్టిక్రించునియెడల మంచి దలంపక.

గీ. ప్రాణనాధులార వీనిగావకుడిట్టి
వానివిడువజగతి మానవతులు
నెట్టునిల్తురిపుడ నిర్గతసత్వగా
జేసిపుచ్చుడిదియు దోసమనకా॥

వ. అని ద్రౌపదిపలుక కట్లలోనుండి సైంధవుండు దనమనంబున అక్కటా ? అక్కడ భీమార్జునుల ప్రార్థించి చావు దప్పించుకుంటి నిక్కడ ద్రౌపది మరల వీరలకు రోసంబులుబెంచుచున్నదే అయ్యో యోనింకనెవ్విధంబున వీరిబారి దప్పించుకొని తొలంగువాడ ననిపాండు నందనులంజూచి హస్తంబులుమొగిచి దీనాననుండయి హీనస్వరంబున.

దర్వు- తోడి అట.

పాండవోత్తములార మీదాసుండ నన్నికగావరే భండనంబున నోడినాడను బ్రతుకుపొమ్మని విడువరే॥

వ. అని ప్రార్థించుచుండ ధౌమ్యుండు పాండవులంజూచి.

క. విడువగదగ దీతని మద
మడగించుచుండ పుడమికపకారియు
మీపడతినివడి రథముననిడి
యుడుగడు జడియండు పాండవోత్తములారా.

వ. అనిన సైంధవుండు భయంబుతో పాండవులజూచి॥

దర్వు॥ తప్పులెన్న బోకుడీమీదయకుపాత్రుడబ్రోవుడీ తప్పుజేశితి భీతగదనిచెప్పి విడచీపుచ్చుడీ॥

మా॥ అనిన ద్రౌపది నాథులారా వీనివినయంబులు చాలాగల వితండాచరించిన కార్యంబు మదినదలంచు డిదియునుంగాక॥

క. దుర్మార్గుల శిక్షించుచు
ధర్మపరుల రక్షసేయ దగునృపులకునీ
దుర్మదు వదలిననాడు
ష్కర్మము మిమునంటుగావగాదగదితని॥

వ. అని ద్రౌపదిబలుక సింధువిభుండు కౌంతేయులతో.

దర్వు॥ దారసుతులనుశేరగా నిలుజేరనిండికమెల్లగా నేరననుచును చంపలేపుకోరపోరాయనుడికా॥ తప్పులెన్న॥

వ. అనిద్రౌపద సైంధవుంజూచి.

క. దారసుతులుండినను పర
దారలగోరుదువ దుర్మదా నినుధరలో
నేరీతి విధిసృజించెర
జారడచోరుడవుతుచ్ఛ ఛా ఛీపోరా.



వ. అని ద్రౌపది యేమియుంబలుకకయుండె సైంధవుండు॥

దర్వు॥ పన్నగనుధర తమ్ములూరి పన్నగాంతకవాహను నెన్నుకొనుచు నికెన్నటికినీ చిన్నిపనులకుపోవనూ పాండవోత్తములార మీదాసుండ నన్నికగావరే॥

వ. కురువంశపావనా ధర్మనందన వందనంబులు.

గీ. సకల సయిన్యములును సమసెరణంబున
మొనసిప్రాణమానములునుబోయె
నింకనన్ను విడువు మిందుకులేశ్వర
పట్టణంబుకేగి బ్రతుకువాడ॥

అనిన ధర్మజుండు సైంధవుతో.

ఉ. బంధుడవయ్యు సైన్యములు పార్థివుడంచును నిన్నుగొల్వగా
నెందునునెవ్వరెయ్యెడలనీగతిగా చెరియించియుందురే
నిందెకునోర్చినాడవహనింద్రియలోజనిధర్మబాహ్యకా
మాంధునికెట్లుదుస్సలను నక్కటమాధృతరాష్ట్రుడిచ్చెనో॥

వ. దుర్జనశిఖామణియగు దుర్యోధను సాంగత్యపరుండవగుటచే నీకాదుర్గుణంబు లలవడియె గతజలసేతుబంధనంబు తమ్ములారా? యింతపని యేలచేసితిరి॥

క. దునుమగువాని ననిలో
దునుముటతగు నితడుబంధుడును తలమీసం
బును గడ్డంబును దరుగుట
తనవుదరుగుటకంటె తుచ్ఛతన మనిలసుతా॥

వ. గావున వీనికర్మంబు వీనినేబాధించు. నయ్యయో వీనికిదియే చాలు నింకనయినను.

గీ. కట్లువదలించుడితడెటకైననేగు
పరితపించెడు దీనుడయిప్రాణభీతి

మనకు దాసుండనని యనీ మునులువినగ
నింకనొండొనబోక మన్నించివిడుడూ.

వ. అనిన ధర్మజుతో ధౌమ్యుండు.

ఉ. ఏమనవచ్చునీదగు దయెంతనమార్య చరిత్ర నేడుమీ
భామనుబల్మినెత్తుకొని పాఱినహీనుని నిట్లుగాచితౌ
సోమకులావతంసగన చోద్యమునీకెయజాతశత్రుడన్
నామము చెల్లునిద్ధరణి నంతటవ్యాపితమయ్యె కీర్తియున్॥

వ. అని ధౌమ్యుండు ధర్మజు శాంతగుణంబులు ప్రస్తుతించుచుండ భీముండు సైంధవుంజేరి కట్లువిడచుచు సైంధవా నీకుమంచికాలంబయి పార్థుండు నావెంటవచ్చినవాడు రానిచో పిన్నా పొదసమీపంబున నే పాతిపెట్టనే॥

క. ఇంతగవేడియు బ్రతికే
దింతుల చరబట్టదలచితివిభీమా భూ
కాంతుడు విడుమనె జనుని
కాంతామణిసూత్రమిపుడు ఘట్టిదియయ్యెన్॥

వ. అనివిడచిన సైంధవుండు శరీరంబు సవరించుకొని ధర్మరాజుం జూచి మానవేంద్రా వందనంబులు.

దర్వు- హిందూ రూ.

ధర్మప్రభో దయజూడుభూవిభో దుర్మార్గుడనూ దుష్కర్ముడ నయ్యెయొ॥ ధర్మ॥

నాతప్పుగావూనను కృపబ్రోవూ పాతాకీ పొమ్మని ప్రాణ దానమివ్వు॥ ధర్మ॥

భండానభీతూను పాండావదాసూడ దండీగాతమ్ములూరి ధా మూనివేడువాడ॥ ధర్మ॥

వ. మహాత్మా మీదాసుండ నాయజ్ఞానంబు సహించి వదలుం



డు తమనామంబు దలంచుచు బ్రతుకగలవాడనని ధర్మజుతో బలుకుచుండ ద్రౌపతి సైంధవుంజూచి నవ్వుచూ॥

ఉ. బాహుబలుండ పాండవుల భండనమందున దృంతునంటివా
సాహసమెందుబోయె బలసంఘముయెక్కడ దాగియుండెనో
త్సాహముదక్కినందరను సారెకునవ్వ విరూపివైతివీ
వాహవవిక్రమోద్ధతులటంచును మత్పతులన్ యెరుంగుదే॥

వ. ఇంతమాత్రంబునకే నంతగా మిట్టిపడవలెనా ఛీ దురాత్మా నిన్నుజూచిన మహాపాతకంబు సంప్రాప్తంబగు నీవున్న నీపుణ్యాశ్రమంబు చెడు నని ధర్మజుంజూచి ప్రాణనాథా వీడుభవదాసుండనని యె నీయుత్తమస్థానంబున తవసన్నిధిన నీఖలుండుండతగండు గాన వదలుడు అనిన ధర్మజుండు సైంధవుం జూచి॥

దర్వు- శం. ఏక.

ఏమనననగు నింకాబొమ్ము కామలోలనిన్ భూమిమీద దుర్యశంబు బొందుసార్వకాలమున్॥ యే॥

హీనమతీ యెన్నడిటుల కానిపనికి జొరకుమా మానప్రాణములకుచాలా హానిగలుగు నెరుగుమా॥ యే॥

నాదు వచనమునకు మిగుల గాదని మత్సోదరుల్ నీదు ప్రాణమునకు దెగకనిల్చి నారు ఘనభుజుల్॥ యే॥

ధారుణీవర తమ్ములూరి ధాము రాముదలచుచున్ జేరుపురము సుదినమనుచు మీరదగు నె కాలమున్॥

గీ. నింక నెన్నడు నీలాటి హితవుగాని
పనులకును బోక పూర్వుల పద్ధతిగను
బుద్ధిమంతుడవై రాజ్యభోగములను
ననుభవించుచు సుతులతో మనుము జనుమూ.

వ. అని కరుణగాబలికిన ధర్మనందనునకు నమస్కరించి సైంధవుండచ్చోటు విడిచి తిరిగి తిరిగి పాండవుల గనుంగొనుచు తృణబిందుని

యాశ్రమంబుదాటి యేకాంగియై ఘోరారణ్యంబు జొచ్చి కొంతదూరం బరిగి యొక వృక్షంబు నీడన గూరుచుండి పెల్లడరు శోకంబుడుప జాలక తన శరీరంబు నూచుకొనుచు మనంబున.

దరువు - నాథనామక్రియా - ఏక.

ఈ రూపమున పురికేరీతి జేరుద హా సారసాక్షి నాసతిగని యేమి విచారము పడునో హా॥

విధికెంత పాపము మొదలజేశితినో హా మదమణగెనదుర్మద యని నల ద్రౌపదిచే బడనాయె హా॥

సింధురాశ్వరథ బృందంబులు సమసె నిందపాలైతీ నహా
బంధువుల యెదుట పదిమంది నవ్వంగనే పందనైపారీతిహా
తమ్ములూరి పురిధాముడౌ రామునీదయలేక పోయెనహా॥
ఇమ్మహీపయి సతిహీనవ్రాబ్రతుకాయె నెమ్మోయీజనుదూనహా॥

హా యీశ్వరా సరివారిలో తలవంచు కొనునటుల జేశితివిగాఁ భీమసేనుని పాదతాడనముల గాయంబు లెంతకాలంబునకు మానునో శరీరంబంతయు రుధిరంబుగారబిగించి కట్టినకట్ల దద్దులతో నెవ్విధంబున పురంబునకేగి దార సుతాదుల కెదుట బడువాడ హా ఏమీ యీ కాలంబు.

ఉ. ఏటికి రాజ్యమింక తనువేటికి దారసుతాదు లేటికిన్
ఘోటక సింధు సైన్యములు గొప్పగు శస్త్రధనాది సంపదల్
దీటగు వారి సన్నిధిని ద్రెక్కొనరాని పరాభవంబు నా
బోటి నృపాలుకుంగలిగె భూమినియుండిన చావ మొక్కటే.

వ. హా పరమేశ దేహత్యాగంబు జేసుకుంటినేని ఆత్మహత్యా దోషంబు ప్రాపించు నదియునుంగాకఁ గతించియెను పాండవుల నేమి సాధించువాడఁ నగుదు.

గీ. గాన యీలాగు పురికి బోగాదునాకు
నవ్వగే విన్న దుర్యోధనాది బంధు



లకటగంగకు జని యీశునాత్మనిలిపి
తపముజేశియు పాండవుల్దర్ప మడతూ.

వ. అని కృతనిశ్చయుండై దిగ్గునలేచిఁ గంగా ద్వారంబునకరిగి స్నానం బాడి ధౌతపరిధానుండై వార్చి పశుపతి నుద్దేశించి తపంబు శేయ నారంభించి.

దరువు - శంక - ఏక.

వందే భవానీపతీ ముని వందితనీవేగతీ పొందూగ నీపద బృందములె నమ్మీతి సందేహములు బాపుమా ననుగావూము వం॥

శంకారభక్తావ శంకారనేని కింకారుడగావుమా లేదా ప్రేమ వందేభవానీ॥

దక్షాధ్వరధ్వంస ప్రత్యక్షమై భక్తరక్షణ శేయూశివా కృపా భావ॥ వందే॥

తమ్మాలూరీ పురిధామూని చెలికాడ నమ్మీతినీబ్రోవరా యిందురార వందేభవానీపతీ॥

చ. హితమతి నిన్ను వేడెదను యీశ్వర సర్వశరణ్యా పార్వతీ
పతికరకంఠ దేవముని పద్మజవంద్య పురారిశంకరా
రతిపతివైరిదాస జనరక్షణ యిందుధరాకపర్దిగో
పతిరత శూలపాణి హరపాపవిమోచన వహ్నిలోచనా.

వ. అని యిట్లు నమ్మహాదేవుని సంస్తుతించి పంచాక్షర మంత్రంబు జపియించుచు పాదాంగుష్టంబున నిలచి నిరాహారుండై యత్యుగ్రతపంబు జేశిన. ఈశ్వరుండు సంతుష్టాంత రంగుండై కైలాసంబున పార్వతిం జూచి

దర్వు - కేదా - ఆది.

సతీమణీ శింధుపతికి వరమివ్వ నతిత్వరితగతి నేగుదమా॥

అతిస్థిరమతిన్మతీననూ పశుపతీయనుచు గొనియాడె సుమా అనిన పార్వతి యీ లోపల తపంబులు శేయడము వరంబు లివ్వడము లేక చాలాకాలంబాయె నిప్పుడేదో తటస్తంబుగా బోవుచున్నదే.

క. కైలాసవాస సైంధవు పాలికి జనవలదు పరమభక్తుడుగానీ
చాలును సానందునకై కాలునిపురికోలుపోవ గలిగిన కారుల్.

భవానీ యిటు బల్కను.

దర్పమించీ కామూని జేయించీ క్రోధములడంచి తనుకృశించా గనూ పంచాక్షరిని శేవించీ తపముసాధించీ నను నాశించెగనూ॥ స॥

వ. నాథా నామనివివిను దాసులకై బహు ఆయాసంబు పడిన వారము మీరెరుంగరా.

క. దేవా మార్కండేయునకై వధియించితిరి మున్ను కాలునినభవా
కావుము దిక్కనిశ్యామలదేవియు బహుగోడుజెంద దీనశరణ్యా.

వ. సర్వేశ్వరః తద్విధమేయిపుడు సంభవింప బోవుచున్నటుల గన్పించుచున్నది.

అనిన శంభుండు సుదతీ వెరువకు.

ద॥ శరాణంచు నన్నురువకను సురచిరా భక్తివేడగా కరుణించకున్న ధరా తమ్ములూరి హరీవిస యిది సరీయనకుగా.

పార్వతి నాథా బాగాయున్నది మురహరుండు సరియనడు అని గాబోలు భక్తులకు వరంబు లివ్వడము.

గీ. చాలు యొరులకునై మనకేల బాధ
వారు వీరందరనెదరు వారికేమి
పరుల బిడ్డల భావిలోబడగ నెట్టి
లోతుగనెడు మహాత్ములా ధాత హరియూ.

వ. భవాని హరియు విరించియునేమి జేశిరి వారలననబోకు విను.



క. ఎక్కటియై గంగానది ప్రక్కనభూతేశ నీవె ప్రభువనినార్తుల్
మ్రొక్కగ చేతులుగొట్టుట నక్కటతగువగునే దేవుడందురె తరుణీ.

వ. ఫాలాక్షా రక్షించుమనిన వరమిచ్చుట మంచిదే.

క. కొంచపు వరమివ్వరు మిము
నెంచి తపము శేయు భక్తులేమడిగిన కరు
ణించుదురల భస్మాసురునుంచి పడిన
వెతలు దలుప నెదవుల్ భయముల్.

వ. కావున నాతలంపులు మగు డోకఁనిరక్షించరై తి రేని మిమ్ముల నికతలంచక మానుదురు మనకేయుపాధిలేక సుఖంబుగానుం దుము॥ అనిన పరమేశ్వరుండు.

క. యిందు ముఖి భస్మదానవు
చందంబున నందరకుగ జాలుదురటె నా
డెందమునకు మరుపొదవడు
సైంధవునకు స్వల్పవర మొసంగుదు రమ్మా.

వ. నాథా మీరిచ్చుట నిపుడీరీతిగానే బలుకుదురు భక్తునిచూడ శరీరంబు పొంగి తనువైన దాపక నొసంగుదురు గాన.

క. మూరెడు బోవగనేటికి బారెడు గ్రుంగంగనేల పరమేశ్వరమీ
రూరక గనుచుండుడువా రేరీతిని జనిననేమి యీశ్వరమనరుల్.

వ. కాంతా నీవు భక్తరక్షణివిగావా సైంధవుండు కంఠగత ప్రాణుండైయున్నవాడు మనమరుగమేని నతండు దేహంబువదలు నా హత్యమనకు ప్రాపించు నిప్పటికొాక హత్యచేతపించుచున్న వాడఁగాన.

గీ. హిమనగతనూజ గనుము యీ సమయమునను
తగినవరములు నిత్తమాతనికి లెమ్ము.

మా॥ కాల కంధర మిమ్మింతగా నిర్బంధించ గలదాననా.

గీ. ప్రాణనాయక మీవాంఛ బాపనేల
లెండు జనుదము సైంధవు దండకభవా.

వ. అని పార్వతి బలుక పరమేశ్వరుండు సంతసించియుమా సమేతంబుగా.

క. యురమున శశిమెరయగ తన
కరమున శూలంబుదాల్చి కరకంఠుండున్
గిరివర తనయతో సాత్వా
త్కారుడయ్యెను సింధుపతికి గామితమొసగన్.

వ. ఇట్లు హరుండు ప్రత్యక్షుండై వత్సా నింక తపంబు చాలించుమని తన కరంబున నతని శరీరంబునిమిరినం దెలశి. సర్వాంగ భూసంగతంబగు దండ ప్రణామంబాచరించి కరకమలంబులు ఫాలంబునం గదియించి.

క. వందనము దురితహరణా
వందన మసురారి యమరవందిత చరణా
వందే పన్నగ భరణా
వందనమిదె దేవదేవ వరమృగధరణా.

దరువు.

కాలకంధరా కరుణించు శంకరా ఫాలనేత్ర కరుణాలవాలా భక్తపాల మునిజనలోలా ॥ కాలకం॥

సంగరహిత సర్వమంగళార్ధదే హాంగజ హతసురపుంగవనుతపద॥

తమ్ములూరి పురిధాముని సఖనిను నమ్మితి బ్రోవవె నరహరి వరదా॥ కాలకంధర॥

వ. అని యనేకవిధంబుల బ్రస్తుతించుచుండ యురగ భూషణుండు పరమదయాళుండై యిట్లనియె.

క. సింధుపతి నీదు తపముకు
డెందము నానందమొందె దెల్పుము కోర్కెల్
సందేహమేల విను నీ
యందున కృపగలిగె నడుగుమయ్య వరంబుల్.



అనిన సైంధవుండు కరంబులు మోడ్చి.

చ. వరదశశాంకమౌళి హరవత్సలతం గరుణించెదేని
భీకరులగు పాండునందనుల గర్వమడంగగ సంగరోర్వి మ
త్కరముల కోడునట్టులుగ సల్పుము నాకిదె యీప్సితంబు మా
నరపరమేశ శూలధర వాసుకి భూషణ భక్తపోషణా.

వ. అనిన ఈశ్వరుండు సైంధవా యీకోరిక నీకు నెరవేరదెట్లనిన.

సీ. పాండునందనులలఘుబాహుబలాఢ్యులు ధర్మార్జితులు తపోధైర్యధనులు। శరణాగత త్రాణబిరుదులు శౌర్యులు పరమార్థకోవిదుల్ పార్థుల మలు।లరి భీకరులు శాంతపరులు దురాచార హరులు సత్యవ్రతాచరితులార్యు।లాహా వదక్షులు న్నాశ్రిత రక్షులు నసఘులనంత విక్రమను తేజు । లట్టివారల గెలువ నీకరిదివత్స నందునరుడింతవాడన నలవిగాదు । సంతతోత్సాహి మాకు నేకాంతభక్తుఁడమరులచె దివ్యశరముల నందె నతడూ. కావున సైంధవా.

దరువు.

నరుని గెలువ నీతరమగునటరా పరమ పురుషుడవ్యయుడల మురహరుడుగలడు తోడా॥ న॥

సురపతి మొదలగు దిక్పతులచె నరిభీకరములైన శరములుగొనె నా యిరుకరములచేతను గాండీవము సరిగదిగియ నేర్పుగలుగు॥ న॥ అని లో వెరువకను నొక్కటి మార్గాని మును ననుగెలచిన ఘన విక్రముడా॥ నరు॥ మెచ్చి పాశుపత శరమా పార్థునకేనిచ్చినాడ హెచ్చునీరుడా॥ నరు॥ తమ్ములూరి ధాముని మదిలో నమ్మియుండు నమ్మహాబలుండా॥ నరుని॥ మరియు॥

గీ. ఘోర రణమున నన్నైన మీరు వాడు
నేజయింపగనోపగా నేరవిజయు
డస్త్రశస్త్రాది విద్యల నధికుడెందు
నిక్కమది నమ్ము గెలువంగ నీకుగాదూ.

వ. అని నిరాశగా బలికిన పరమేశునకు నమస్కరించి సైంధవుండు.

క. దేవా తనువు గృశింపగ
నీవిధమున తపమొనర్చి నినుబొడగంటిన్
నావాంఛిత మింకెవ్వరు
గావించెదు వారలీవుగాదనభవా.

వ. ఈ పంచాగ్ని మధ్యంబున దారసుతాదులన్ విడచి నీరీతి దపంబు జేసి.

క. మిమ్ముగని నామనోరథ మిమ్మెయి విఫలంబుగాగనే నెటుపురికిన్
నెమ్మెనితోడ జనియెద నిమ్మహదాటవినినసువులిడిచెద దేవా.

వ. అనిన ఈశ్వరుండు సైంధవా యింత తెంపు శేయదగునా మాకశక్యంబగు కోరికకోరిన లభించునా మంచది యెవ్విధంబున నైనను నీవాంఛితంబు సఫలంబు శేయవలయునుగదా నొక సదుపాయంబు దెల్పెద వినుము.

చ. విజయుడు లేనివేళ నతివిక్రమ శౌర్యముదాల్చి నీవు ధ
ర్మజనలినాత్మజాకవలమార్కొని నాహవమందు నోర్తుగా
క జసురసంఘమొక్కటియునైన జయింపనసాధ్య మమ్మహా
భుజునతివీరునిం దలువబోలునె యేటికి వెఱ్ఱి సైంధవా.

వ. గాన నొక్కనాటి కయ్యంబున ధర్మజ భీమ నకుల సహదేవుల జయించగలవు నావచనంబు దప్పనేరదు యింక నీపురంబున కరుగు నేను బోవుచున్న వాడనని యీశ్వరుండదృశ్యుండైన సైంధవుండు అర్జునుని జయించునట్లుగా పరమేశ్వరుండు వరంబొసంగడాయె నయినను అతండు నాయెడ నింత విరోధిగాడు నన్ను విడిపించినవాడే పార్థుండు నాకు ప్రత్యపకారి భీముండు గదా.

మ. నను బంధుండనియెంచకా తడనిలో నన్పాదఘాతంబులన్
తనువెల్లన్ రుధిరంబు గ్రక్కనశిచేత న్మిసముల్దోలించె
దుర్జనుడా భీముని గెల్తు నింకమదికిన్ సంతోషమామ్ముద్వ్రతం
బును సాకల్యముజెందె నింకపురిలో సంపూజ్యునై యుండెదన్

వ. అని గమనోన్ముఖుండై యరణ్యంబుదాటి మెల్లమెల్లన తన పురంబునకేగి రాత్రికాలంబున నేరికిన్ గానరాకుండ నంతఃపురంబు జేరి మంత్రినిం బిలుపించిన నతండుజనుదెంచి దీర్ఘకేశ వికృతాకారుండగు సింధుభూవరుంగని ఆశ్చర్యమగ్నుండై రాజా మన రథగజతురగ పదాదులు తమ మిత్రులు యెందు జనినవారు తామొంటిగా జనుదెంచుటకు కారణంబేమి రాజా.

అనిన సైంధవుండు.

ఉ. కారణమేమిదెల్పుదును కానన సీమనమిత్రసంఘముల్
వారణఘోటకాదుల నివారిత సత్వరమేగుచుండని
ష్కారణవృత్తి పాండవులఖండ పరాక్రములై బలంబులన్
జేరిచిరంతకాలయము చిక్కితి నొక్కని సంగరంబునన్.

వ. అట్టి పరాక్రమవంతుల సేనొక్కరుండ నోర్పువాడనే అయినను సరివారల యెదుట భంగమునొందకుండ నానేర్పున మెల్లగా తప్పించుకొని తృణబిందుని యాశ్రమంబుగడచి గంగా ద్వారంబునకరిగి నుమేశుగూర్చి తపంబు సేసిన దక్షాధ్వరనీశుకుండు ప్రత్యక్షంబై

క. ఖండేందుమౌళి బలికెన
ఖండిత బలవిక్రమమున కదనములోనన్
చండ పరాక్రములగు
నప్పాండవుల జయించగలవు పటు బాణములన్

వ. అని కరుణించి యురగ భూషణుండు గిరినివాసంబునకరిగె. ఇట్టి ఘట్టివరంబు సంపాదించుకొని వచ్చినవాడ పదమూడవయేటి కడపట కౌంతేయులు రాజ్యకాంక్షులై గజపురంబున కరుగుదెంతురు తత్సమయంబున సుయోధనాదులు సంతసింప నాపగదీర్చుకొనియెద నిది మదీయవృత్తాంతంబు.

మంత్రి—మహారాజ.

క. యెంతపని జేశితిరి మీ
యంతటి ఘనులకును దప్పనల వెయొరులకున్
సంతసమాయెను మదిక
క్కౌంతేయులనోర్చు బలముగలిగె మహాత్మా.

వ. అని యిట్లుబలుకు మంత్రి వర్యునింగలశి సైంధవుండు తాను బడిన దురవస్థలెరింగింపక మరుంగుననుంచి భూరక్షణంబాచరించుచుండె నిట పాండవులు కామ్యకవనంబున మునిసంఘంబుతో సుఖంబుండి ధౌమ్యుండు ప్రస్తావవశంబున సైంధవు పరిభవంబునాటి పాండవ పరాక్రమంబుదలంచి వారలతో నిట్లనియె.

ధర్మనందనా.

గీ. తపమునందున ధర్మ తత్పరతసాధు
చరితమున విప్రసేవల శత్రు హరణ
దక్షులన మీకె తగుశరధాటి సింధు
పతిని బట్టంగగంటి మీబలము నాడు.

వ. మరియు నీ భీమార్జునల పరాక్రమంబేమనవచ్చు హా.

మ. మదవత్సింధుర బృందకందరములన్ మండంగ నీభీముడున్
నెదురై వచ్చు పదాతులన్ శరములన్ నీల్గంగభీభత్సుడున్
యుదయార్కోజ్వల మూర్తులంగవిశి నెందున్ తారమైదోచిరో
కదనం బేమనవచ్చు నిట్టిబలులుంగానంగ రాదెయ్యెడన్.

వ. అనిన ధర్మనందనుండు.

గీ. ధౌమ్యమునివర్యద్రుపదనందనపవిత్ర
చరితగావున సైంధవజనుడు జిక్కె
నోడుబుచ్చెనె దుశ్శాసనుండు సభను
వలువలొలువంగ లేకతా నిలచెనోడీ.



వ. సాక్షాత్పుండరీకాక్షుం డక్షయవలువలొసంగ నఘ్నమహాత్ముండు తోడునీడమై నిమ్మానిని రక్షించుచుండగా నీసుదతి కొక్క దురితం బొరయ నేరదనిన. తన్ను మెచ్చుకొను ధర్మనందనునకు నమస్కరించి పతులనందర నాలోకించి.

సీ. ప్రాణేశులార మీ ప్రాపుగల్గుట జేసి యుర్వి నెల్లెడలను యోగ్యనైతి। ప్రాణేశులార మీ ప్రాపుగల్గుట జేసి మునుల పాదంబులు మొక్కనైతి। ప్రాణేశులార మీ ప్రాపుగల్గుట జేసి నాశ్రమంబులు ద్రొక్కనర్హనైతి! ప్రాణేశులార మీ ప్రాపుగల్గుట జేసి సతులలో నుత్తమ చరితనైతి। శత్రుఖండనులగు పుత్రజననినైతి పరగ యాగంబులను ధర్మపత్నినైతి।కలిహరణ సర్వతీర్థాభిగమననైతి వీరులగు మిమ్ముజేరి పవిత్రనైతీ.

వ. నాథులారా! మీయఖండదయ నాయందుండుటంజేసి దుశ్శాసన సైంధవాది దుష్టలోకంబు పాలుగాక సుఖినై యున్నదాన నట్టి నన్ను రక్షించిన మీకనవరతము శరణానై మీమరుగున బ్రతుకుదాన అనిన ధర్మనందనుండు.

భామినీ! నీయందు మేమందరము సములమె భీముండతిశయాంతఃకరుణ గలవాడనుట సైంధవ పరిభవంబు నాటిపరాక్రమంబే దెలియ జేయుచున్నది గదా యనిన ద్రౌపది భీమసేనునకు నమస్కరించి.

సీ. దీనపోషక భీమసేన నీకృపగల్గ కాననంబుల దిరుగాడగంటి। దీనపోషక భీమసేన నీకృపగల్గ కిమ్మీరసురబారికిని దొగితి । దీనపోషక భీమసేన నీకృపగల్గ దండిజటదానవుండండవిడచె । దీనపోషక భీమసేన నీకృపగల్గ పాపిసైంధవు పరాభవముగంటి । గాన నీబాహుగుప్తియు గలుగ నెరుల వలన నెక్కింత భయము నావంకజనదు । భండనోద్దండ చండ ప్రచండతేజ ఖండితారాతి సన్మానిఖ్యాతి నీతి.

వ. మహాత్మా నీవలన నేనును ధర్మజాదులు ననేక విపత్తులు గడువగంటిమి అనిన భీముండు॥ ద్రౌపదిం జూచి.

ఉ. మానిని నన్ను నిట్లు బహుమానము శేయుచు బల్కనేల నీ
మానవనాథు ధర్మజు నమానుష తేజున కెగ్గుజూచు యు
ద్ధానికి ధాత్రిపై నిలువవల్లగు నాద్రుతరాష్ట్రి కూసులన్
పూని మదీయ బాహులచె బోదురు నూర్వరు కాలుద్రాలికిన్

వ. అని సరససల్లాప సంభాషణంబులు సేయుచుండ పరమ మునీంద్ర శిఖామణియగు మార్కండేయుండు పాండవ దర్శనార్థియై

దరువు.

శ్రీ సదాశివ శంభో శంకర వాసుకి భూషణ దోషహరణ శివ॥ స్మరహరగిరిజా వరసుగుణాకర పరమపురుష గంగాధర త్ర్యంబక॥ తమ్మలూరి పురిధాముని వరసఖనమ్మితి బ్రోవుము నాగ కంకణ॥ అని శివస్మరణ శేయుచు వచ్చునెడ.

వ. ధౌమ్యుండు దూరంబునం బొడగాంచి ధర్మరాజుతో రాజేంద్రా ఆది మునీంద్రుండగు మార్కండేయుల వారు వొచ్చుచున్నవారే యేమి నీపుణ్యంబు॥ అనినఁ ధర్మనందనుండు అనుజ ధౌమ్య ద్రౌపది బ్రాహ్మణ సమేతంబుగా నెదురేగి నమస్కరించి నమ్మునీంద్రుని దోట్కొని వచ్చి యజినాసనంబు పయిం గూర్చుండబెట్టి యర్ఘ్య పాద్యాది విధులం బూజించి. ధర్మరాజు వరముని చంద్రావందనం.

యిది పల్లవి.

దురిత హరణ శుభచరణయుమావర స్మరణాకరుణా భరణా మీకిదే॥ వరము॥

సాధుచరిత సమ్మోదమానసా భేదరహిత కల్పాది జీవితా॥ వర॥ తమ్మలూరి పురిధాముని ప్రియసఖు సమ్మతిగను మది నమ్మినట్టిమికు॥ వరముని చంద్రా వందనం,

వ. అని నమస్కరించిన నంత శ్రీరస్తు సమస్త మంగళాని భవంతు ధర్మజా యీ పుణ్యావతి మీ ధర్మపత్ని యేనా? అగును మహాత్మా



ౕన ద్రౌపది మునీంద్రా వందనంబులు. దీర్ఘసుమంగళీభవ॥ అని దీవిం ౕ యనంతరంబ.

ధర్మజుండు హస్తంబులుమోడ్చి మార్కండేయుతో.

ఉ. మీ పదరాజసోకి వనమెల్ల పవిత్రతజెంది వెగ్గెను
ద్దీపిత బ్రహ్మతేజునతిదీర్ఘతరాయుని జూడ దుఃఖ సం
తాపముదీరె పుణ్యమును దాకొనె తొల్లిటి జన్మమందు నే
నిపదకంజముల్ గనుటకేమి తపంబొనరించి నాడనో.

వ. అని నుతించిన. ధర్మరాజా!

క. మీ యాశ్రమ వాసులు శుభు
లాయుష్మంతులరె మీరలందరి జూడన్
గాయుత్సాహము బొడమియు
నేయిందులకొచ్చి నాడ నిజమున రేంద్రా.

వ. సత్యప్రతిజ్ఞా పరిపాలకులై సతీ సహితంబుగా మీరలు ంబులన శేషతీర్థంబు లాడుచున్న వారలని దేవేంద్ర సభయందు మీర్తివిని మీతో గలసి యేనును తీర్థంబులాడవచ్చిన వాడ యుధిష్టరాన ధర్మజుండు. మహాత్మా మాజన్మంబులు కడతేర మాయందు వాత్సల్యతనుంచి మీరిం దరుదెంచితిరిగాన కృతార్థులమైతిమి ుునను మీకు దెలియని వర్తమానంబులుండవు మాకష్టంబు లెరిం చెద వినుండు.

ధర్మరాజు దరువు.

మానిచంద్రా వినుమా వెతాలు యిట్లుపూనిరె తొల్లింటి నృలూ॥ మా॥ కానన సీమలలోన సానుజాలతోడగూడి మేనులవియ లశియుండఁగా నాయసంతతము॥ మాని॥

భీకర మృగంబులరచు. కేకలాకు నోర్వకను వ్యాకులమును జెం మ నీకోకిలవాణియు॥ మా॥ పథములందురుధిర ధారలొదవ కఠినశిలల క్కి యదచలించి కదలలేకపోదిలు ద్రౌపదదుగో॥

పంతగించి దుర్యోధనుడింతకు కారణము మమ్ముఁ గాంతార ములకనిపి శ్రీమంతుండై యుండెను.

చింతలపూఁడి రాఘవఁ మంత్రి నేలునట్టి సీతా కాంతూనికి కరుణ లేక చింతా జెందవలసె॥ మా॥

వ. మునీంద్రా సమస్త భోగంబులు వదలి యీ ఘోరా రణ్యంబు చేరినను మాపూర్వకృతకర్మంబులు వెంటదగిలి యిక్కడను బాధించుచున్నవి.

ఉ. పరమ మునీంద్ర మేముమృగపంక్తులఁద్రుంచగ నేగనాశ్రమాం
తరమున నెంటి నున్న కృపదాత్మజనార్తినిమగ్న సింధుభూ
వరుడు రథంబుపైనిడి యవారిత సత్వర నేగుచుండ ద
త్కరితురగాదులందునుమకామినిడించియు పారెనాతఁడుఁ.

యీ విపత్తు తమ యనుగ్రహంబుచే కడతేరి యిట్లియ్యాశ్ర మంబున నున్నవారము మహాత్మా.

వ. ధర్మరాజా నీవు సోదర సహితంబుగా పత్ని వెంటనుండ మూలభృత్య బ్రాహ్మణ నివహంబుతో నరణ్యంబుల దిరుగుచున్న వాడవు తొల్లి॥

ఉ. రాముడు తొల్లి జానకిని రావణుచేతను గోలుపోయి చిం
తాముఖుడై వనంబులను దమ్ముడు గొల్చుచురాగ వానర
స్తోమము నాశ్రయించి యతి శూరత నాదశకంఠుద్రుంచి శ్రీ
ధాముడయోధ్య నేలడె సితంబగు కీర్తి సుఖంబు నొందడే.

వ. ధర్మజా సాక్షాద్వైకుంఠుండగు రాముడు కాలవశత చేత పదునాలుగు వత్సరంబులు జటావల్కలంబులు ధరియించి కాననంబున సంచరించి కాంతను గోల్పోయి యనుజసహితుండై కొంత కాలంబు వర్తించి పిదప శీతాంగనా సమేతుండై సుఖంబనుభవించె దేహ ధారి యగు దేహికి ప్రారబ్ధకర్మంబులు దప్పనేరవు నీవు సామాన్యుండవే నిన్నొరులు జయించగలవారలే చెప్పెద విను.



సీ. జపతప స్వాధ్యాయచరిత ప్రవృద్ధుండు విమలమానసుడు ధౌమ్యమునివరుండు। సత్యక్షమాదానశాంతి సదాచారమయశాలి నీవు ధర్మప్రభుండ। వీరశత్రు మదాపహారి యుగ్రగదా విహారి విక్రముడు కిమ్మీరవైరి। చండమార్తాండ తేజః కీర్తిమండల గాండీవధరుడు అఖండల సుతు।డన్యోన్య సౌభ్రాత్రు లస్త్రశస్త్రాధికులాహవదక్షులుమైన కవలు। సాధ్వీపుణ్యవ్రతాయోని సంభవసతి వంశవర్ధనులాహవ వైరి జితులు। నందనులు ప్రతివింద్యాదు లధికయశులుఁ। గలరు నీసాటి ధాత్రిలో గలరె నృపులూ.

వ. నిదియునుం గాక సకల లోకరక్షకుండగు నధోక్షజుండు తన చెలియలిని పార్థునకొసంగి నీతో సంబంధంబు చేసె గావున.

దరువు.

ఏమనవచ్చును రాజా నీసరి యెవరిలరవి తేజా స్వామిజార్తి హార ణుడు వైకుంఠుడు మీామేన మరిది యట నీభాగ్యం॥ చే॥

హితుడై నీకాశ్రితుడై సంతసమతియై మిమ్మల సతతముబ్రోవగ॥

చెలికాడగుచును చెప్పిన పనులనునిలచితలచగా నెర వేర్చును హా॥

బృందారక ముని డెందంబులకును నందరాని హరిబంధుండట నిన్నే॥ మ॥

తమ్మలూరి పురిధాముడు కృష్ణుడు సమ్మతిగను నీతమ్ముని సారథి॥

వ. అనిన ధర్మజుండు మేమేనా బలవంతుల మచ్చటనుండు వారు పగతు లల్పులే.

గీ. గురుడు నాతని పుత్రుండు శరపటిష్టు
లాహవబలుండు కృపుడు పితామహుండు
చండ విక్రముడును కర్ణ శకుని దుర్యో
ధనులు శూరులు గెలువగాదరమె మాకూ.

వ. వారలం దలంచిన నాకేయికంటికి నిద్ర బొరయకుండునట్టి ఘోర శస్త్రాస్త్ర పారీణులగు.

క. కురువిభు కర్ణుల ననిలో
బరిమార్చియు రాజ్యపదవి బడసెదమోగా
కరుల మది సంతసింపగ
తరుణితో నిట్లడవి నెపుడు తగ దిరిగెదమో.

వ. మునీంద్రా సందేహ నివృత్తిసేయుము కురుసభయందు మాపడిన యవమానంబు ద్రౌపదికొడవిన యుపద్రవంబు యింతని యెరుంగ బలుకజాల ననుచుండ ద్రౌపది సమీపించి మునీంద్రా వంద నంబులు నామొరా లింపుము.

సీ. పతుల సన్నిధిని నాపయ్యెదబట్టియు సభలోన నీడ్చె దుశ్శాస నుండు । వన్నెలాడీయని సన్న జేసియు తన కురువెక్కరమ్మనె కురు విభుండు । జూదమందోడని నాథునిగోరికొమ్మని పరిహాసంబులాడె కర్ణు। లిందరీరీతిగా నిందింపవిని మదిరంజిల్లియుండె ధృతరాష్ట్ర నృపతి। దక్కు గల వారలిదితగదనుచు బలుక।నెల్ల రప్పుడు వలువలునూడ్చిరట్టి। పరి భవముజెంది హీనత బ్రతుకవలసె । ధర్మజుని తాల్మికొరకునై తాపసేంద్రా॥

వ. మహాత్మా నన్నట్లు పరిహాసంబులాడిన దుష్టాత్ములెన్నటికి నష్టంబగుదురెరింగింపుము. అని దుఃఖించిన ద్రౌపదిం జూచి మార్కం డేయుండు.

క. మానినీ దుఃఖింపకు నవ
మానము నినుజేయుకుటిల మతులను ననిలో
పూని వధియింతురీరల
నూన శ్రీవిభవయుక్తవయ్యెదు సాధ్వీ.

వ. పదమూడవ యేటి కడపట నీమనోరథంబు సఫలంబగు నిం



క చింతింపకు పుణ్యవతీయని మార్కండేయుండు ద్రౌపది నూరార్చి ధర్మనందనుం జూచి యందరు వినుచుండ నిట్లనియె.

సీ. రాజశేఖర శత్రురాజిని బరిమార్చి వసుమతీ రాజ్యంబు వడయ గలవు । గాంగేయ కృప ద్రోణ కర్ణసుయోధనులాదిగాగల వీరయోధులెల్ల । పార్థునమోఘాస్త్ర బాణపాతంబుల బడు వారలిది నిజంబగు విధంబు। పరమ సాధ్విని సభబరిభవించిన కీడు బ్రతుకనిచ్చునె వారి పాపమతుల । సత్యవ్రతమును నెరులకు జనునె జరుప । శాంత మూర్తివి నీకు నజాతశత్రు । డనెడి సత్కీర్తిదగునయ్య నవనివినవే । ధర్మమేవర్ధతీ యన ధర్మతనయా.

వ. కావున ధర్మంబును నధర్మంబు జయింపనోపదు మీకే కష్టంబులేమనిన పూర్వ జన్మసుకృత దుష్కృతంబులు జీవులకు వెంట నంటియుండి సుఖదుఃఖంబు లనుభవింపజేయునది ద్రోయ కర్మబద్ధుం డైన జీవునకు నలవిగాదు ప్రాణికోటికి కర్మంబువలన జన్మంబు సంభ వించు జన్మంబున కర్మక్షోభంబైన కాలంబున జీవుండు భోక్తయైయుం డు. సకల జన్మంబుల మానవజన్మంబు దుర్లభంబు యీ జన్మంబున సకల జన్మంబుల తొల్లి యార్జించిన దుష్కృతంబు లడప జీవునికి తగిన యుపాధి సాధనంబులగు జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులు నితర జన్మల కంటె సుకరంబై యుండుంగావున మీ ధర్మంబు మిమ్ముల జయింపజేయు. కౌరవుల కధర్మంబు జయంబును నీరీతినే దలంపుము వారల యధర్మం బు తుదకు వారలందునుముటయే గాక దురాత్ములను దుష్కీర్తి శా శ్వతంబుగా పొందగలరు కావున సుస్థిరుండవై యరణ్యవాసకౌరత దివ సంబుల పుణ్యతీర్థావ గాహనంబుసేసి తదుపరియొక సంవత్సరంబజ్ఞాత వాస కష్టంబనుభవించి పిదప శత్రువులను జయించి పితృపితామహ సం ప్రాప్తంబగు రాజ్యంబు పూజ్యంబుగానేలగలవు ధర్మనందనా యని మార్కండేయుండు పాండవులను ద్రౌపదిని సంతుష్టాంతరంగులం గా వించి వారలంగలసి యనేకయాత్రా తీర్థంబులాడుచు రామాయణాది పుణ్య కథలు వినుపించుచుండ కౌంతేయు లత్యంతానందమగ్నులై మార్కం

జేయు ధౌమ్య బ్రాహ్మణ నివహంబుతో కామ్యక వనంబున సుఖం బుండిరని భారతపుందరణ్య పర్వములో నుండు సైంధవుని పాండవులు పరిభవ మొనరించు కథ.

క. జనమేజయ రాజేంద్రు న
కును వైశంపాయనుడు దెల్పె కోరిన నట్లె
నును రాఘవమంత్రీ స
జ్జన భూషణ నాటకముగ విన జెప్పితిని.

క. తరణీ శశియుడు గణములు
సురగిరి గంగాది నదులు సూనృతవాదుల్
ధరగల కాలముసితమై
సరసత నీధర్మరాజ చరితము వెలయుఁ.

సీ. శ్రీరస్తు బంధురాశ్రితపోషణోస్తు దీర్ఘాయుష్య మస్త్వలంకారమస్తు । సంతత ప్రియమస్తు శౌర్యగాంభీర్య మాస్త్వానందమస్తు సన్మానితస్తు । ధనధాన్య వాహానదంపతీ సహితోస్తు వినయోస్తు సత్కీర్తి విస్తరస్తు । కళ్యాణ మస్తు సత్కార్యనిర్వాహోస్తు సత్పుత్ర పౌత్ర భాస్వత జయోస్తు । మిత్రజనరక్షణాస్తు యిమ్మేదినందు।వినుత చింతలపుడివంశ వృద్ధిరస్తు । రాఘవామాత్య బుధజనరంజనస్తు క్షేత్రుతుష్యమస్తు శాశ్వితైశ్వర్యమస్తు॥ శ్రీరమానాథు సత్కృప సిద్ధిరస్తు॥

మంగళ హారతి.

మంగళంబిదే సీతాంగనాపతే॥

మంగళంబు ఖగతురంగ దనుజభంగ సంగరహిత మునిపుంగవ నుత నీకు॥ మం॥

భండనోద్దండ మార్తాండ వంశోద్ధార ఖండిత దశముఖచండ విక్రమ జయ॥ మంగళం॥



సుందర వదనార విందర సంక్రందన వందితపద ముచుకుందవరద జయ॥ మంగళం॥

సీలకరుణాల వాల రాఘవ మంత్రి పాల తమ్మలూరిలోల రామ నృపాల॥ మంగళంబిదే సీతాంగనాపతే॥

క. మంగళము రామచంద్రా
మంగళ మమరేంద్ర సేవ్యమాన నరేంద్రా
మంగళము సుగుణ సాంద్రా
మంగళ మిదె తమ్మలూరి మధుదైత్యారీ.

గద్య.

ఇతి శ్రీ సీతారామచరణారవింద శేవా ధురంధర నారాయణాన్వయ పారావార సుధాకర కౌండిన్యసగోత్ర పవిత్ర సచ్చరిత్ర పిచ్చయార్య పుత్ర సుజనవిధేయ కవితవిద్యావిశారద సుబ్రహ్మణ్య నామధేయ ప్రణీతంబైన ధర్మరాజవిజయంబను యక్షగాన ప్రబంధంబునందు సర్వంబును సంపూర్ణము.



సర్వం శ్రీ సీతారామ చంద్ర సద్గురు పరబ్రహ్మార్పణమస్తు.



